# శ్రీ కృష్ణగారడి

[ పౌరాణిక నాటకము ]




రచన:

తాంత్ర సుబ్రహ్మణ్యం.



పబ్లిషర్సు:

జయశ్రీ బుక్ డిపో,

ప్రొప్రయిటర్సు:

శ్రీరాం శ్రీరాములు అండ్ సన్సు,

రాజరాజేశ్వరీపేట : : విజయవాడ - 2.

 [వెల 1-8-0

మొదటి కూర్పు ప్రతులు
1955 1000

## సూచన

ఈ నాటకం యొక్క పూర్తి హక్కులు నాకు చెంది యున్నవి గనుక, నా వ్రాతపూర్వకమైన అనుమతిని ముందుగా పొందనిదే, ప్రదర్శించుట, ప్రింటుచేయుట, అనువదించుట, సినిమా, రేడియో రికార్డింగు వగైరా వినియోగపరచుట చేయరాదు. ఇందుకు అతిక్రమించువారు నాచే జరుపబడు సివిలు క్రిమినలు చర్యలకు బాధ్యులగుదురు.

శ్రీరాం శ్రీరాములు

ప్రింటరు:
శ్రీ సరస్వతీ ప్రెస్,
ఇంచిపేట : విజయవాడ 2

# నివాళి

‘ప్రగతి’ అంటూ దేశం - కాలం ముందడుగు వేస్తుంటే సాంఘిక నాటకాలు వ్రాయక పురాణ గాథలతో కాలక్షేపం చేస్తున్నానని మిత్రులు సూచిస్తున్నారు. ఒకప్రక్క కళాపరిషత్తువారుగూడా సాంఘికాలనే సన్మానించారు. కాని దేశవ్యాప్తంగా ప్రదర్శింపవచ్చేసరికి ప్రజల్లో సాంఘికాలకు ఆదరణ పరిమితంగానేఉందిగాని విస్తృతంగా కానరాలేదు. కారణమేమని ఎంత తర్కించుకొన్నా అంతు చిక్కలేదు. సాంఘికంగా తెలుగునాటవున్న సమస్యలు చాలాతక్కువ. సాంఘిక, రాజకీయరంగాల్లో పరిణామం వచ్చేసరికి కొన్ని సమస్యలు వాటంతట అవే పరిష్కారమైపోతాయి. హరిజన సమస్య తీసుకొని ‘పతితపావన’ సృష్టించాను. ఇరవై యేళ్లు గడచేసరికి యిప్పుడు అధిశిఘాస్మృతిలోకి వచ్చి ఆ సమస్య దాదాపు తీరిపోయింది.

ఇంతకూ - స్థూలంగాగాక సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే ఐంద్రజాలికంగా కనబడే లీలలు, మాయలు, మంత్రాలు- ఇవన్నీ భగవత్పరంగా సమర్థింపబడే సన్నివేశాలనిభావిస్తే కథావస్తువులోని మూలం అంతా పౌరాణికానికీ, సాంఘికానికీ ఒక్కరూపంలోనే ద్యోతకమౌతుంది. ఉదాహరణకు శాకుంతలం చాలు. శకుంతలను గాంధర్వంగా ప్రేమించి పెళ్లాడాడు, చక్రవర్తి దుష్యంతుడు. తీరా ఆమె గర్భవతియై కాపురానకు వెళ్ళేసరికి అదంతా మరచానని తిరస్కరించాడు. ఆ మూలాలు నిరాశ చెందక - నిబ్బరించుకొని - పుట్టింటికిరాక పుట్టిన బిడ్డను పెంచి పెద్దవాణ్ణిచేసి తల్లి ధర్మం నెరవేర్చుకొంది. సంతానరీత్యా తుదకు ఆ దంపతులు ఒక్కటైనారు. దీనిని పౌరాణికమంటాము. ఈ కథనే ‘ఒక జమీందారు’ అని నేటి సాంఘిక పాత్రలతో సృష్టించి పలికిస్తే అది సాంఘికమని ఆమోదముద్ర వేస్తాం.

వాస్తవంగా - ప్రచారానకు ఉపయోగించే ఇటీవలి రాజకీయ సాహిత్యంతప్ప నేడు సాంఘికాలనబడేవన్నీ, నా దృష్ట్యా యీ శ్రేణికి చెందినవే. గాంధీమహాత్ముని దివ్యజీవితం సమకాలికం గాన నేడు సాంఘికం; ఒక శతాబ్దానికి చరిత్రాత్మకం- కొన్నితరాలు దాటేసరికి అదే పౌరాణికంగామారుతుంది. కాన ధర్మాలు,కర్మాలు,ఆదర్శాలు ఆశయాలు, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు అన్నీ ఏకాలంలోనైనా ఒకే రూపంలో ఉంటాయి. ఆ యా సమయాల సమాజ ప్రగతినిబట్టి అను భూతి, అన్వయాల్లో పరివర్తన ప్రతిబింబిస్తూంటుంది. అంతే.

ఈ దృక్పథంతోటే యీ పౌరాణిక గాథను ఎంచుకొన్నాను.

నాటినుండి నేటివరకు 'గోపాంగనా యౌవన భాగ్యరత్నం' 'రాసక్రీడాభిరామం' అని శ్రీకృష్ణపరమాత్మను ఆరాధిస్తున్నాము. వేలాది గొల్లభామలు ఆయన్ను ఆశ్రయించారు; ఆయనతో విహ రించారు. ఆనాటి గోకులసమాజం యీ కామకలాపాన్ని ఎలా అర్థం చేసుకొంది? ఎలా సమర్థించుకొంది? అదంతా పరమాత్మ యొక్క మధురభావ ప్రకటనమని ముముక్షువులూ, భావుకులూ వ్యాఖ్యానించవచ్చు. కాని ఆనాటి సంఘంలో పెద్దపెట్టున అశాంతి చెలరేగిందా! కాపురాల్లో గగ్గోలుపుట్టిందా? మరి విశ్వశ్రేయస్సుకై ఆవిర్భవించిన కృష్ణపరమాత్మ గోకులసంఘదృష్టిలో ఇంతదిగజారిపోతే తెలిసికూడా అనుక్షణం ఆయనకోసమే వారంతా ఎలా పరితపించారు? కాన- ఇప్పుడు ప్లెటానిక్ లవ్ అని వాడకంలోకి వచ్చినట్లు ఆనాడు ఒక విశిష్టమైన, విశ్వజనీనమైన, కామానికి అతీతమైన విశ్వప్రేమ పూరితమైన మధురభావం ప్రాదుర్భావమైంది. ఆ మహదాశయసిద్ధికై సమాజాన్ని సంఘటిత పరచి విశ్వప్రేమ సందేశమిచ్చాడు, శ్రీకృష్ణ పరమాత్మ.

ఈ నాటక రచనకు యిదే నా లక్ష్యం. కథ అంతా కల్పనే. సన్నివేశాలు సమకూర్చి మాటలు గిలికించి, పాత్రలతో పలికించాను. అనుకున్నదంతా అందరికీ అందించానో లేదో తీర్పు చెప్పవలసింది సహృదయులు.

మునుపటివారివలె యీ కావ్యకన్యకకూడా జేజే లందుకొన వలెనని నా ఆశ. అట్టి అదృష్టానకు నన్నాశీర్వదింప సర్వేస్సర్వత్రా ఇదే నా నివ్వాళి.

బ్రాహ్మణవీధి,
విజయవాడ.
1—4—55

ఇట్లు,
తాండ్ర సుబ్రహ్మణ్యం.



## పాత్రలు:

శ్రీకృష్ణ — వైజయంతి

అవతారం — వల్లకి

ఆనందతీర్థ — సత్యభామ

భక్తులు — ప్రేక్షకులు



## ప్రార్థన.

ప్రాయము నల్వదేండ్లు డిగె;
వచ్చిన పేరది వచ్చె; నేటి దీ
ర్ఘాయువు అవ్వదే; ఇక ప
రానకు సాధన సేతుమన్న, రూ
పాయి గడింపకేన్ జరుగు
బాటు హుళక్కి; నమస్కరించి, నే
వ్రాయుచు 'కృష్ణగారడి' అ
భావము లేని యశమ్ము గూర్చి, ఆ
ప్యాయత నన్ను బ్రోవుమయ
ఆపద మొక్కులవాడ! వెంకనా!!

తాండ్ర సుబ్రహ్మణ్యం.

శ్రీ రస్తు శుభమస్తు

# శ్రీ కృష్ణగారడి

## ఒకటవ రంగం.

స్థలం : ... యమునాతీరం

సమయము : ... ఉదయము

వల్లకి

[వయసులోవున్న గొల్లపడుచు. మధురానగరంలో చల్లనమ్మ బోతూంది. పొలిమేర దాటింది. యమునా వాహిని ప్రశాంతంగా ప్రవహిస్తూంది. వనాంతరంలోని ఫలపుష్పాల పరిమళం చల్లనిగాలి రెక్కలమీద విజయంచేసి సర్వత్రా విందుచేస్తున్నది. ప్రణయరసోద్రిక్తమైన ఆ వాతావరణాన్ని చూచి పులకాంకితయైంది. ఒకానొక మధురస్మృతి భావనకువచ్చి, అప్రయత్నంగా నాట్యంచేస్తుంది]

గీతం:

మాధవ మనసిజ విశిఖభయాదివ భావనయాత్వయి లీనా
సావిరహేతవదీనా కృష్ణా
అవిరళనిపతితమదన శరాదివ భవదవనాయవిశాలం
స్వహృదయ మర్మణి వర్మకరోతి సజల నళినీదళజాలం సావిర॥

కుసుమ విశిఖ శరతల్ప మనల్ప
విలాస కమలాకమనీయం
వ్రతమివ పరిరంభసుఖాయ
కరోతి కుసుమయనీయం
సావిర హేతవదీనా

వహతి చవలిత విలోచన జలధర
మానస కమలము దారం
మిధుమివ వికట విధుంతుద
దంతదళన గలితామృతసారం
సావిర హేతవదీనా

ప్రతిపదమిదమపి నిగదతి మాధవ
తవచరణే పతితాహం
త్వయి విముఖేమయిన పది సుధానిధి
రపితమతే తనుదాహం
సావిర హేతవదీనా

వైజయంతి : (అందాలరాణి, భావగీతాల మధురవాణి, సంస్కృతితో పాటు సంస్కరణ, విశిష్టభావనతో పాటు విమర్శనాదృష్టీ కలది. ఆమె సౌందర్యానికి అందరు హారతి పట్టుతారనే ఆత్మ విశ్వాసం. ఈ అనంతవిశ్వ సౌందర్యాన్ని సమతాధర్మంతో అందరు ఆరాధించి, ఆనందించాలేగాని అనుభూతిని ఏఒక్కరూ కైవసం చేసుకొనటం స్వార్థమని ఆమె సిద్ధాంతం. ప్రేమిం చటం ప్రేమకొరకేననే ఆమెఆశయం. బృందావనంలో పూలు

కోసికొని మాలిక అల్లుకుంటూ వస్తున్నది. దూరంనుంచి వల్లకి నాట్యంచూచి సంశయాత్మయై దగ్గరకువస్తుంది.)

వల్లకి : (పారవశ్యంతో వైజయంతిని కౌగలించుకొంటుంది)

వైజయంతి : (పకపక నవ్వి) వల్లకీ! వల్లకీ!

వల్లకి : (తేరిపారచూచి - నివ్వెరపడి) ఎవరు వైజయంతి!

వైజ : ఆ వైజయంతిని. నేను గనుక సరిపోయినది. మరి యే మగవాడైనను యీపాటికి కృష్ణకృష్ణ అని కొంపతీసేవాడే.

వల్లకి : వైజయంతీ! అది కలయో - వైష్ణవమాయయో - మరి యే సంకల్పార్థమోగాని, గతరాత్రి -

శ్లో॥ వేణీమూలే విరచిత ఘనశ్యామ పింఛావచూడో
విద్యుల్లేఖావలయిత ఇవస్నిగ్ధ పీతాంబరేణ.
మామాలింగం మరకత మణిస్తంభ గంభీరబాహుః
స్వప్నే దృష్టస్తరుణ తులసీభూషణో కృష్ణదేవం.

అప్పటినుంచి అదే భ్రమత; ఇప్పటికీ అదే మమత.

వైజ : కలలో కామించినా కృష్ణుడు! ఇంకనునయం; పరకాయప్రవేశంతో వైకుంఠం చూపలేదు.

వల్లకి : ఆ మధురమోహన లావణ్యమూర్తి - ఆ లోకోత్తరపురుషుని సహవాసము వైకుంఠమే వైజయంతీ! శ్రీకృష్ణ ధ్యానాకర్షణ దర్శనగానంబుల చవిచూడలేదుగావ సామాన్యునిగా తలంచుచున్నావు.

వైజ : ఆ మహానుభావుడు ఒక్కసారి నాకగుపడిన బాగుండును. ఆయన పస చూతును; నా కసి చూపింతును.

వల్లకి : ఎప్పుడో యననేల! అనుక్షణం బృందావనంలోని ప్రత్యణువులోను సాక్షాత్కరించుటలేదా! కృష్ణుడన నేమని?

ఉ॥ నీలఘనాభమై మధుర
నిర్మల మంజుల వేణునాదమై
లోల తటిల్లతా లలిత
లోచనతారకమై ప్రసన్నతో
జ్వల ముఖేందుమండల న
వీనవిలాస కళా కలావమై
పాలిత గోపికా ప్రణయ
భావమె రూపముదాల్చె కృష్ణుడై.

వైజ : హరిహరి! ఎంత నైతికపతనం! ఎంత అవాచ్య ప్రసంగం! ఎంత నైచ్య మీ సాంగత్యం! చెప్పుకొనుటకు మీకు సిగ్గుగుట లేదా? మారుమనువు మహాపాపంగాదా? స్వేచ్ఛావిహారం స్వైరిణికి గాక సంసారిణికి తగునా? మీకు మానం అభిమానం లేదా? ఆత్మగౌరవం శూన్యమా?

వల్లకి : వైజయంతీ! అనుభవైక వేద్యము గానందున అంతగా విమర్శించి ఆక్షేపించుచుంటివి. ఆయన వేణు గానమాధుర్యం ఆస్వాదించి నోరు వాయిలేని పశువులే పరవశమగుచుండ మానవమాత్రులమైన నీ నా మాట యేమి?

ఉ. తల్లుల చన్నుబాలు మును
ద్రావు లేటిందమ కర్ణవీథులన్
వల్లభమైన మాధవుని
వంశరవామృత ధారసొచ్చినం
దుల్లక పాలుద్రావకయె
మూటకమానక కృష్ణమీద తృ
ణ్వల్లులు పేర్చినిల్చి నిల
పత్నము లావులె సోకమావగా.

శైవ : వినగావచ్చు. వాద్యవిశేషం ఉండవచ్చు. మహాగాయకుడు గావచ్చు. అంతమాత్రాన అతనికి అమ్ముడుబోదురా ఆడువారు. లోకంలో పాడువారు లేరా; వినువారు లేరా? అందు కని పాటకచ్చేరి పడకటిల్లుగా పరివర్తనమగునా?

వల్లకి : అతడు గాయకుడేగాదు. పృథివిలో పురుషులనే మోహింపజేయు పురాణపురుషుడు. ఒక్కసారి ఆ నీలమేఘశ్యాముని జూచి, మరి యాతడు గానబడకున్న లోకమే చీకటైపోయినట్లగును.

మ. తరుణుల్ గొందరు మూలగేహములను
ద్దండించి రారాక త
ద్విరహాగ్నిప్ల పరితాపమందుచు మనో
వీథిన్ విభున్ మాధవున్
పరిరంభంబులుచేసి జారుడనుచున్
భావించియున్ జొక్కిపొం
దిరి ముక్తిన్ గుణదేహముల్ విడచి ప్రీ
తిన్ బంధనిర్ముక్తలై.

ఇప్పుడు తెలిసెనా శ్రీకృష్ణ మహాత్మ్యం.

శైజ : ఆ ఎప్పుడో తెలిసినది యీ చరిత్రఅంతయు.

వల్లకి : ఏమని?

శైజ : ఈ యుగంలో వ్యభిచారం పడతులకు పరమార్థమైనదని.

వల్లకి . వ్యభిచారమా?

శైజ : కాదా! పరపురుషునితో ప్రణయసాహచర్యం భక్తిభావమా? బృందావనభూములలో- యమునా సైకతసీమలలో - సౌరభ్యలతానికుంజారామాలలో మంగళసూత్ర ధర్మాన్ని దగ్ధంచేసి మారుమగని గూడుట భాగవతలక్షణమా!

చ. ఇలునడి సున్న జేసి, హృద
యేశుల సిగ్గులువుచ్చి, అత్తమా
మల నెరిఁయించి, సోదరుల
మానసము నూరలువుచ్చి, తల్లిదం
డ్రుల గుచిమాన్పి, బంధులకు
రోతయొనర్చుచు జారవాంఛలన్
పలవరి సత్కులాంగనలు
పత్తురె లోకులు చూచి మెత్తురే.

క. నడవడి కొరగాకున్నను
జడుఁడైన కురూపియైన వామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను
విడచుట మర్యాదగాదు విభునే సతికిన్

వల్లకి : (నిశితంగా) వైజయంతీ! గొల్లభామలు కులటలుగారు కులాంగనలు. శ్రీకృష్ణుడు ప్రాకృతుడుగాడు భగవంతుడు. మా సంబంధం ఐహిక కామోద్రేకంగాదు అకళంక ప్రేమారాధనము. భక్తులను భగవంతుని ఏకమొనర్చు సూత్రబంధము. అవినాభావమైన, అనశ్వరమైన, నిత్యానంద సంధాయకమైన ఒక శక్తి. అదే భక్తి. అదే మా సన్నిహిత బాంధవ్యము.

వైజ : ఐనదానిని ఉపన్యాసం. గాఢ ప్రేమికులకు మూఢవిశ్వాసము లెక్కువ. అయన దేవదేవుడైన యీ శిరచాటు జీవిత మెందులకు? పడుచుపిల్లలతో పరిష్వంగ సౌఖ్యములా? రమణీమణులతో రాసక్రీడలా? మగవాలులతో మన్మథ విలాసములా? ఇదేనా ధర్మం; దైవత్వమును. ఇదే భగవల్లీలలని ప్రస్తుతించి పైబడుదుమా? కట్టుకొన్నవారి కళ్ళనుండు కామ కలాపములా? ఏమని మీరందరు మూకఉమ్మడి గ్రామజాతరగా మోహింపుట?

సీ. అందాలరాజైన చందమామందువా
నాగరికములేని నల్లవాడు
పాలిమేర కెనలేని భూస్వామియందువా
గోబృందముల మేపు గొల్లవాడు
వీరాధివీరుడా వేల్పు పెద్దందువా
దోచిదోచని పచ్చిదొంగవాడు
కర్మాల నెడబాపు ధర్మవేత్తందువా
ముశితల వంచించు మోసగాడు

పూతనన్ జంపి, మద్దుల పుడమిగూల్చి,
పర్వతంబెత్తి, కాళీయ ఫణినడంచి,
వినుతిగాంచుట కనికట్టు విద్యగాక
కొలువ నేటికి కృష్ణుండు కొంటెవాడు.

నల్లని : అసత్యపు మాటలాడకుము. ఆ కృష్ణుడు అవతారమూర్తిగాక మానవమాత్రుడా? ఐన అన్ని మహాత్మ్యముల నవలీల సల్పుట సాధ్యమా?

సీ. కన్నులుదెరవనీ కడు చిన్నపాపడై
దానవి చనుబాల ద్రాగి చంపె
మూడవనెలనాడు ముద్దులబాలుడై
కోపించి శకటంబు గూలదన్నె
ఏడాదికుఱ్ఱడై యెగసి తృణావర్తు
మెడబట్టుకొని కూల్చి మృతుని జేసె
తల్లి వెన్నలకునై తను ఱోలగట్టిన
గొమరుడై మద్దుల కూలనీడ్చె

పసుల గ్రేపులగాచుచు బకుని జీరె
వెలగతో వత్స దైత్యుని వ్రేసిగడపె
సబలుడై ఖరదైత్యుని సంహరించె
వసుధ కృష్ణుండు మనుజుడా వైజయంతి?

వైజ : అక్షరాల మానవుడు. పైగా మానవత్వం లోపించిన సామాన్యుడు.

వల్లకి : నీకు ఉన్మాదమా లేక మతిభ్రమణమా?

వైజ : నాకుగాదు నీకు. నీకేగాదు. ఈ గోకులమునకు. ప్రేమించిన స్త్రీని పెళ్ళిచేసికొనవలదా? అందునను ఒకరా ఇద్దరా? పదహారువేల గోపికలా? అంతరమైన గమనింపక ఆ కూని ముక్కుసలి కుబ్జయా? ఇంతమందిని మురిపించి మోహించి మోసగించి పడమటి సముద్రమునకు పలాయనం చిత్తగించెనా? ఇదియేనా మానవత్వం?

వల్లకి : అదియే పరమాత్మ మానుషభావం.

వైజ : ఏమిటా భావం? స్త్రీలను దిగంబరులను జేసి తైతెక్కలాడుటమా? ఇది మహా ఘనకార్యమని లోకం కైవారం చెప్పాటియా? గోపికా వస్త్రాపహరణం గొప్పయిన గోపాలకృష్ణునకు ద్రౌపదీ వస్త్రాపహరణం తప్పయినదేమి? అయ్యయ్యో! ఎనిమిదిమంది వెంటబడిరే! కాపురములు గగ్గోలుపడెనే! కనుపించిన చాలునని కాంక్షించిరే! దగ్గరున్నచో! తీరా వచ్చిన తన గౌరవమర్యాదలు తగ్గునేమోనని ద్వారకలో దాగుకొనెనా? ఇంతమందిని మోహించి మళ్ళీ పెళ్ళి వేగించుకొనుట యెందులకు; మీ గొంతులుకోయుటం తప్ప.

వల్లకి : శ్రీకృష్ణుడు మానాధుడేగాదు జగన్నాథుడు. ధర్మ సంస్థాపనార్థం అవతరించిన ఆదిదేవుడు. ఈ విశాల ప్రపంచమంతయు ఆయన కుటుంబమేగదా.

వైజ : పెండ్లాడినను ఒక్కరితనా? ఎనిమిదిమందిని. పదుగురిలో పలుకుబడి సంపాదించిన, బహుభార్యాత్వం ప్రమాణంగా పరిపోవునా? వేదవేద్యుడైన విధినిషేధములు వలదా? వయసు, వరుస అక్కర లేదా? బాంధవ్యమైనను పరిగణింపవలదా?

శ్రీకృ : అజ్ఞానంలోపడి అపవాదులు కురిపించు నీ లోకం. అంతియే గాని అసభ్యముగను అసంగతముగను ఎన్నడు సంచరింపలేదు.

సు. ఎవ్వరో సాక్ష్యమీయ బనిలేదు. ఎదురుగా మేనత్త రాధ చాలు.

శ్రీకృ : పిచ్చిదానా! ఇదేనా నీకు తెలిసినది. రాధ వృషభాను పుత్రిక. ఆది గోపిక. ఆధ్యాత్మికస్వరూపిణి. అది యొక వేదాంత తాత్విక దాంపత్యం. మన రాయాణు భార్య రాధికను చూచియా రాధ అనుచుంటివి. రాధిక నందగోపుని పిత్రియు సోదరి గాన మేనత్తయే. ఊరూ, పేరూ, రూపమూ ఒక్క తీరున ఉన్నందున రాధయే రాధికయను అపవాదుకు అల వాలమైనది. నీవంటివారు ప్రచారంచేసిన చాలు. కట్టుకథకు కూడా ఖండాంతర ఖ్యాతివచ్చును.

సు : సప్తజన్మములకైన నా కీర్తి అధఃపతనము ప్రసాదింపవద్దని భగవంతునికి వెయివేలదండములు. (పరికించి) అదిగో తుమ్మెదల దండు. అవియు మీ కృష్ణునివలెనే మందార మకరంద మాధుర్యమునుగ్రోలి మరియొక బృందావనమునకు ప్రయాణించుచున్నవి. ఓ తుమ్మెదా!

మ. ఒకపువ్వందలి తేనెద్రావి మధుపా
యుత్సాహివై నీవు వే
రొకటింబొందెదు భంగి స్త్రీ నధర పీ
యూషంబునన్ దేల్చి ఆ
యకలంకోజ్జ్వల యౌవనంబుగొని యా
న్యాసక్తి ధర్మంబొకో
ఇక నీయాటలు సాగిరావనుచు నే
డే చెప్పుమా కృష్ణునన్.

వల్లిక : ఓ భ్రమరా!

ఉ. బంధుల బిడ్డలన్ మగల
భ్రాతల తల్లుల దండ్రులన్ మనో
బాంధత జేసి డించి శర
ణందిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోన ద్రోచి యిటు
చేరక పోవుట పాడిగాదు ష
ట్పంధయ మీా యధీశునకు
పాదములంబడి యొత్తి చెప్పవే.

(తుమ్మెద ఎగిరిపోవును)

ఆ మా కృష్ణుడు నా సందేశం వినున్నా! వినగనే వచ్చును. అదే నా నోములపంట. తప్పక రేపే వచ్చును. వైజయంతీ! చూడు నా మాట.

వైజ. : కానిమ్ము. కృష్ణగారడి శక్తిగట్టించుటకు ఈ కథానాయికనే గజ్జెకట్టి సిద్ధంగానే ఉన్నది.



# శ్రీ కృష్ణ గారడి

## రెండవ రంగం

స్థలం : బృందావన ప్రాంతం

సమయం : సాయంకాలం

శ్రీకృష్ణ - సత్యభామ

సత్య : నాథా! బృందావనం సౌందర్యశోభితముగనే ఉన్నది కాని - నాకేమో భయమగుచున్నది.

కృష్ణ : ఏమి?

సత్య : బుసలుకొట్టుచూ - పొగలుగ్రక్కుచూ - ఎగిసిపడే ఆ కాళీయుని నెత్తిపై తాండవమాడితిరే. అబ్బా! ఆ దృశ్యం తలచుకొన్న నా హృదయం స్పందించుచున్నది. అందుకే ఎవ్వరూ రారిచ్చటకు.

కృష్ణ : ఎందుకు రారు? ఆనాడు వాని కడతేర్చితిమేమో - నేటివరకు గోకులమునకు వ్యాకులము పోయినదేమో.

చ. అదిమొదలెవ్వరైన నరు
లా యమునా నదీ హ్రదంబులో
వదలక తోగి నన్ను ఉప
వాసము తోడదలంచి భక్తిమై
గదలక దేవతాదులకు
గా జలతర్పణ మాచరించినన్
సదమలచిత్తులై దురిత
సంఘము బాయుదు రెల్ల వేళలన్.

సత్య : (ముందుకు సాగిపోవుచూ కృష్ణుని చేయిపట్టుకొని) ఆ కొండ కోనకడ కెందులకు? ఇటు రండు పోదము.

కృష్ణ : అదే గోవర్ధన పర్వతము.

సత్య : అదేనా! ఆ మహాపర్వతము! అమ్మయొయ్యో - ఎందుకు చెప్పండి మీ కా సాహసం. ఐనను చిన్నతనంలో మీది యిష్టారాజ్యం, అదుపా? ఆజ్ఞా? ఇప్పుడైతేనా?

కృష్ణ : ఎప్పుడైననూ విశ్వకల్యాణసాధనకు మానవసేవగాక పరమార్థ మేమున్నది?

శా. నందుం డింద్రదనుజ్ఞింబు మానె యిట నా
నా ద్రవ్యసంపత్తి గో
బృందాభీసమేతుడై గొలువ దే
వేంద్రుడు సర్పింపగా
మందధ్వాన ఘనాఘనాగత మహా
శ్మశ్రేణి వారించి ఆ
కుందున్ బాపితి గోకులంబునకు యీ
గోవర్ధనోద్ధారినై.

సత్య : అట్లయిన నేను మీకంటె గొప్పదానను. కొండను గోటిపై నిల్పు బలవంతుని మహాయిల్లాలనుగదా!

కృష్ణ : అందుకేగదా నీ దరహాసంలో నిత్యం దాగుడుమూతలాడు కొనుట. ఇదే గోకులం ఇదే విశ్వకళామందిరం. చూచితివా సత్యా!

సీ. ఏ వంకజూచిన నేణీవిలోచనా
రతికరాజితాస్ఫాటిక గానచయము
ఏ చాయజూచిన నిందు భానా
వల్లకీ వాదన వైభవంబు

ఏ మూలజూచిన ఇభరాజగామినీ
సంగీత సాహితీ సంభ్రమంబు
ఏ యింటజూచిన సింద్రిపెలాల కా
భరతశాస్త్రోక్త భావాభినయము

ఎందుజూచిన గోపికాబృంద గీత
మధుర మోహన మంజుల మూర్ధనంబు
రాగరసభావ మదన సంక్రాంతియైన
ప్రకృతి సౌందర్యక్రీడ రేపల్లెవాడ.

ఇదియంతయు నా బాల్య క్రీడాస్థలం. ఇచ్చట ఈర్ష్యాద్వేషములు - మదమాత్సర్యములు - స్వపరభేదయులు మచ్చుకైనను కానరావు. సాహిత్య, సౌజన్య, సన్నిహిత ప్రేమబంధములో యీ గోకులమంతయు ఏక కుటుంబంవలె వర్ధిల్లును.

సత్య : అందుకేగదా శ్రీవారి అవతారవిశేషం. లేకున్న పదునారువేల గోపికలతో అంతర్యుద్ధాలు అనుక్షణం ఆవిర్భవింపవూ?

కృష్ణ : ఇందు సవతులపోరు లేదు. సంయోగ వియోగసంరంభములు లేవు. సంసార తాపత్రయములు లేవు. సర్వం జగన్నాథంగా - ఆనందం - అనురాగం - ప్రేమ - విశ్వాసం - ప్రతి హృదయంలో తొణికిసలాడుచూ వైకుంఠమువలెనుండును. (పరికించి) చూడు ఆ వచ్చు వయ్యారిభామను.

పల్లవి : (వస్తూ) గీతం
కనుపించితివా - కృష్ణయ్యా - కనికరించినావా - కృష్ణయ్యా
రాకరాక విచ్చేసితివిటు నా
రేఖపండె రాకా శశిముఖి॥

ఆకొమ్మ యీకొమ్మ అందాలుచిమ్మగా
నామాట నీపాట సయ్యాటలాడగా
ఎన్నేళ్ళ నీరాక కెదురు కన్నులు జూచి
కళ్ళు కాయలు కాసెనే మా
యిల్లు కాంతులు బాసెనే

ప్రాణేశా ॥కను॥

సత్య : (నివ్వెరపడి) 'ప్రాణేశా' యనుచున్న దేమిటి?

కృష్ణ : (మందహాసము జేయును)

వల్లకి : దేవరవారు నా ప్రాణేశుడు మాత్రమే గాదు. మా నిజసుందరీ పంచప్రాణేశ్వరుడు, ఈ చరాచర జగత్ప్రాణేశుడు

కృష్ణ : (సత్యను మిన్నకుండమని సంజ్ఞ చేస్తూ) వినుచుంటివా సత్యా

వల్లకి : (విభ్రాంతయై) సత్య! సత్యభామ! నరకాసురునితో యుద్ధము చేసిన నారీమణి! సకలలోకైక సౌందర్యారామ! సత్యభామ! ఆహా! కల్యాణమూర్తులు కన్నులపండువగా విజయము చేశారు. పరమాత్మా!

చ. తపము ఫలించె నాభవము
ధన్యతనందెను నీవు వచ్చినన్
కృప గనుగొన్న మాత్రమున
నీరజలోచన మత్సహాయివై
అపరిమితానురాగమున
అక్కునజేరిచి రాసకేళిని
వుపగత కింకరీత్వ కలి
తోన్నతి జేసితివయ్యా మాధవా॥

కృష్ణ : వల్లకీ! నీ భక్తి తాత్పర్యముల కెంతయు సంతసము. ద్వారకలో నుంటిమన్న మాటయేగాని - అనాటి జలక్రీడలు - రాస క్రీడలు అనుక్షణం నా మనోవీధి విహరించుచు నేయున్నవి.

వల్లకి : అందుకేనా యిన్నాళ్ళు మాకీ వియోగదుఃఖం ప్రసాదించి దూరమైతిరి నెలగాకున్న సంవత్సరముగ కొకతూరియైనను రాజాలరా?

సత్య : ఇప్పుడు వచ్చిరిగదా మీ వేడుకలన్నియు నెరవేర్చుకొనవచ్చు.

వల్లకి : మహాప్రసాదం. స్వామీ! మన చంద్రలేఖకు చక్రవర్తి కొడుకు. సీమంతిని మీకై పడిన చిత్తక్షోభ కంతులేదు. కంఠగతం పడలేక ఆ మధ్య ఆత్మహత్య చేసుకొనబోయి ఆగినది. మీరుంటే యీ గృహఛిద్రాలు లేవుగదా. అందరం ఆటలతో పాటలతో హాయిగా కాలక్షేపం జేసెడివారము.

కృష్ణ : వల్లకీ!

ఉ. పాయని గేహశృంఖలల
బాసి నిరంతర మత్పరత్వమున్
జేయుచునున్న మీకు బ్రీతి
సేయు యుగంబులనైన నేరనన్
బాయక గొల్చు మానసము
ప్రత్యుపకారము గాదలంచి నా
పాయుట దప్పుగాగొనక
వైళము నన్నుక్షమించు వల్లకీ.

వల్లకి : మేమంతటివారమా మీ దాసీలము. నేడు రాసక్రీడోత్సవము జరుపుకొందమా? మరల నెన్నాళ్ళకో మనమంతా కలియుట!

సత్య : ఈ జానపద నృత్యములకా యింతదూరము తీసుకొనివచ్చిరి. మీ జన్మస్థలంగదా అనిరాగా ఏమిటీ వికృతం, విడ్డూరమును!

వల్లకి: విశ్రృతమేమిటి మహారాణీ! మా వైజయంతివలె వాదించు చుంటిరి. మా సంబంధ బాంధవ్య మనాదిది. అది అవాఙ్మానస గోచరం. మా పంచేంద్రియములు శ్రీవారికి అంకితం.

సత్య: పెళ్ళిపేరంటం లేక బ్రహ్మచారిగానున్నప్పుడు అదియొక కథ గాని యిప్పుడు కాపురస్తుడవు తెలిసికొండా. -

కృష్ణు: (వారించి) సత్యా! ఎందుకీ తర్కవాదం? వల్లకీ! మీ అంతరి మనోరథబద్ధుడను. సరి రేమునా! పోదముపద సత్యా!

సత్య: వచ్చినపని వాకిటనే ఐనదన్నట్లు యీమె సల్లాపము సరసంలో దిగుచున్నది. ఇక పదహారువేల గోపిక లేకమైవస్తే మిమ్ములను ఆపగలనా?

కృష్ణు- ఐన నే నిటనేఉంకును వల్లకీ! సత్యకు గోకులమంతయు చూపించి రమ్ము.

సత్య: మేము వచ్చువరకు కదలక మెదలక ఇచ్చటనే యీ గిరిలో ఉండండి.

వల్లకి: (మందహాసంతో కృష్ణునికి నాజ్ఞ జేసి) పద తల్లీ!

(ఇద్దరు పోదురు)

కృష్ణు: (అటునిటు తిరుగుచుండును)

వైజయంతి: (పరుగునవస్తూ) కృష్ణా! శ్రీకృష్ణా! (పరికించుచూ) కృష్ణుడు వచ్చాడట! ఏడీ! (చూచి) నీవేనా?

కృష్ణు: ఏమి?

వైజ: ఏమీలేదు (నవ్వి) మంచిది.

కృష్ణు: నవ్వులో నే నవరసాలు చిలికించే నవలావణ్యవిలాసినివి, ఎవరు నీవు?

వైజ: మన పేరు వైజయంతి!

కృష్ణ: వైజయంతి! పేరుకు తగినట్లుగా పెద్దమనిషివైయుంటే స్వర్గానికి నిచ్చెనలు వేయవచ్చు.

వైజ: వేయవూ! పేరుమోసిన పెద్దమనిషివి. (వెళ్ళబోతూంది)

కృ: వెళ్తున్నావేం తెరతీసి నాటకం ఆపివేసినట్లు!

వైజ: వెళ్ళక? నిలబడితే కలబడేటట్లున్నావు. నమస్తే

(విసురున పోబోతూంది)

కృష్ణ! (పోతున్న వైజయంతిని చేయిపట్టుకొని ఆపి) పలుకరించి పరుగెత్తుతావేమిటి. నా పేరు అసలు గోపాలకృష్ణ.

వైజ: (చెయ్యి విడిపించుకుంటూ) అబ్బ - విడు. అఘాయిత్యం - మోహనమూర్తి అందురు, ఏమిటీ మోటసరసం?

కృష్ణ: మన సరసంలో మోటులేదు సాంగత్యంలో మొగమాటంలేదు.

వైజ: తెలుసు నీ చరిత్రఅంతా. నీకు తెలియదేమో మనం పదహారు వేల గోపికలకు పైచెయ్యినని.

కృ: తెలుసుననుకునేవు నీకేమీ తెలియదని, నాకు తెలుసు.

వైజ: అదేతెలుసు మగవాళ్ళకు. లేకపోతే నీ పురాణము పుస్తకాలెక్కుతుందా?

కృ: నా జీవితమంతయు భాగవతంకాదూ వైజయంతీ! అందు గోపికలేమిటి? జగన్నాటకరంగమున ప్రతిజీవీ ప్రధానపాత్రియే.

వైజ: కాదూ. గజనాటకానికి వ్రజపుర మొక్కటేనా? పరమాత్మవని పలుకుబడిగదా ప్రపంచంలో; నీకీ పరకాంతా ప్రణయవాంఛలేల?

కృ: అని ఎవరన్నారు!

వైజ: అనటమేమిటి? అది నగ్నసత్యమైతే?

సీ. నీవటే చనుబాల ద్రావింపవచ్చిన
పూతనన్ జంపిన పుణ్యమూర్తి
నీవటే లోకాన వెన్నదొంగల పేరు
వ్రేపల్లెకెచ్చిన పెద్దమనిషి

నీవటే గోపికల్ సావాసమున జేరి
కాపురమ్ములధీయు ఘనముఖుండ
నీవటే భక్తాళి కీ విశ్వరూపమ్ము
వేమారు జూపినవిష్ణుమూ ర్తి
నీవు దేవుండవైన యీ పృధివినంత
పాపపరిహారమున్ జేయనలయుగ ని
పడతులంగూడి కామ వ్యాపారవేళ
మాసిపోవునె యీ మచ్చ మాయకృష్ణ.

కృ: అనుభవంలేని ఆడపిల్లవు నీకు ఆనందోబ్రహ్మామైన అకళంక ప్రేమ తత్వము అర్థమగునా? ప్రణయ బాలశిక్షకూడా పరిచయం లేని నీకు అందలి పరమార్థ మెట్లు తెలియు?

వైజ: ఈ వేదాంతమునకేమి? మహాత్ములవలె ఆదర్శాలు చెప్పుట; మానవులకన్న హీనంగా మసలుట. ఇదే మీ నాయకమ్మన్యుల నవసమాజస్థాపనము.

కృ: వైజయంతీ! మనతో సాంగత్యంలేనిదే మన మనసు తెలియు టెట్లు?

వైజ; నీకూ నీ సాంగత్యమునకు నమోన్నమః నమస్తే.

(విసురున పోతుంది.)

కృ: ఉత్తమ ప్రేమసిద్ధాంత మీ యువిదకు బోధపరచినగాని లోకమున కీ చీకాకు వదలదు.



శ్రీ ర స్తు

# శ్రీ కృ ష్ణ గా ర డి

## మూ డ వ రం గం

స్థలం : బృం దా వ నం

సమయం : ఉదయం

వై జ యం తి

గీ తం

ఏమౌతానో - నే - నేమౌతానో
మనసుతీరిచే - మమత కూరిచే
మంద మలయమారుత మౌతానో॥

1

ఝుమ్మని తుమ్మెద కమ్మని గీతం
ఇంపుగ వినుచూ - సొంపుచూపెడి
చంపకమౌతానో - నే - సంపెగనౌతానో॥

2

పూలతీవల - పటి కావల
తలపులతోడు - వలపుల రేడు
ఊయెలూపితే - హాయిగొలిపితే
శారమ్మంటానో - నే - పోపొమ్మంటానో

3

అధరం చిలికే మధురం ఒలికే
తొలకరిప్రేమ పులకరించితే
అనురాగం అమృతాగ్నమైతే
వాహినినాతానో - నే - మోహినినాతానో

శ్రీకృష్ణ: (బికారివేషంలో ప్రవేశించి నడుస్తూ వైజయంతిని తోసుకొని వెళ్ళుచుండును)

వైజ: ఎవరోయి నీవు. మనుష్యులమీద నడుస్తున్నావు.

కృ: (పలుకడు)

వైజ: (రెక్కపుచ్చుకొని) కళ్ళు కనబడుట లేదూ?

కృ: ఊహు.

వైజ: పాపం. గుడ్డివాడవా?

కృ: ఆ! ఎవరా మాట్లాడునది?

వైజ: వైజయంతి

కృ: నీవేనా?

వైజ: అనగా?

కృ: తెలుసులే

వైజ: ఎలా?

కృ: శ్రీకృష్ణుని చేతిలోపడని ఆదర్శస్త్రీవి. ఆడపోతే తీర్థమెదురైనట్లు అగపడితివి.

వైజ: మరి కళ్ళులేవనటవేమి ?

కృ: ఉన్నను కనబడవు. ఏనను నీలో దాగియున్న హృదయం నాకు అద్దంలోవలె అగపడుచు నేయున్నది,

వైజ: అట్టి ఆత్మసందర్శనమునకు నీవేమి పరమాత్మవా?

కృష్ణ: అందరు హర్షిస్తేసరి. లోకంలో దేవునికూర్చి పరిచారం చేసి నది మానవుడేగదా.

వైజ: బాగా చెప్పితివి ఎక్కడికో యీ ఆత్మజ్ఞానము, అనుభవమును. ఆకారం బికారిగాని అంతఃకరణ ఆకాశగంగవలెనున్నది.

ఉ. వెన్నెలరాజువో, పగటి
వేలుపువో, నవమన్మథుండవో
వెన్నుడవో, గిరీశుడవొ,
విశ్వవినూతన సృష్టికర్తవో
కన్నులపండువయ్యె కన
గా, నిది కామమొ, మోహపాశమో
ఉన్నత ప్రేమయో మనసు
నూయెల లూపె నిదేమి చిత్రమో!

కృ: నీకట్లు కనబడుచుంటినేమోగాని — నేనుమాత్రం మాయ మర్మ మెరుగని మానవుడను.

వైజ: ఐన నీ నివాసమెక్కడ?

కృ: ఉ. ఎక్కడ చెప్పవాడ? చరి
యింతు చరాచర జీవకోటులం
దొక్కడనై; స్థిరంబనెడి
దొక్కటి లేదిల; లోక సేవపై
మక్కువ హెచ్చు; సాధుజన
మానస వీధులు నా నివాసముల్;
నిక్కపు ప్రేమతత్వ మవ
నిన్ వెలయింతు పరిచారకర్తనై.

వైజ: ప్రేమ అనగా!

కృ: ప్రేమ! అది ద్వంద్వాతీతము. అభేదరహితము. ఆత్మీయము. సత్య శివసుందరమైన జీవైక్యము. మధురభావం దాని పరిణతి చిదానందసిద్ధితో చివరకు జీవన్ముక్తి.

వైజ: ఈమాత్రం జ్ఞానం కృష్ణుడికున్న ప్రపంచం ఎప్పుడో బాగుపడేది.

కృ: ఏమి – ఆయనకింతైన తెలియదా?

వైజ: తెలిసిన అట్లు సంచరించునా? కనబడిన ఆడుదాని నెల్ల కామించునా?

కృ: ఎందుకో అంత జిజ్ఞాస ఆ మహానుభావునకు?

వైజ: ఎందుకేమిటి? తమిదీర అనుభవించుటకు. అమాయికలైన ఆడువారు అలభ్యయోగంగా కైవసమైతే సరి.

కృ: మరి సంఘం సమ్మతించెనా అందులకు?

వైజ: సంఘమేమిచేయగలదు, అలవిగాని వాళ్ళయితే.

కృ: మరి లోకం విష్ణువని కీర్తించునే కృష్ణుని.

వైజ: సంకీర్తనలకేమి? పదిమంది వెంటబడి అదేపనిగా ప్రచారం చేసిన నామరూపాలులేని ప్రతివాడు నాయకుడై తుదకు భగవంతుడై పోవచ్చు లేని మహిమలన్నీ అభినయింపవచ్చు. మన నెత్తిమీద కూర్చొని అధికారం చెలాయించవచ్చు. అలాగే కృష్ణుడును.

ఉ. మాయల మానులాడు వెడ
మాటలు ధర్మములంచు నమ్మి ఆ
ప్యాయత జేరు కామినుల
వంచనజేయ మహాత్ముడౌనె? నా
రాయణు డాతడైన వర
లక్ష్మిగనే నవతారమెత్తనే
మాయజగాన తంత్రములు
మంత్రములై శివమెత్తి యాడవే॥

కృ : వైజయంతీ! దుష్టశిక్షణతో శిష్టరక్షణ గావించిన విశ్వశాంతి ప్రవర్తకుడా కృష్ణుడు. ప్రపంచం ఆమాత్రం గౌరవింపవలదా?

వైజ : గొప్పవాడు గనుకనే గుణదోషం ఉండరాదని నా మతం. మూఢుల విషయం విమర్శించు వారెవ్వరు? లోకమును తీర్చి దిద్దగల ధీశాలి - విశ్వవిఖ్యాతి నార్జించిన వీరాధివీరుడు- రాణకెక్కిన రాజకీయ వేత్త - అన్నియు మంచిగుణములే, యిది తప్పు.

కృ : ఈ విహారములో ఏ విశ్వసందేశం అంతర్భాగమైనదో మరి.

వైజ : అతిగా వాదించుచుంటివి నీ వెరుగుదువా కృష్ణుని.

కృ : ఆ - ఏమి?

వైజ : నీ పేరు?

కృ : గోపాలుడు! కొన్నాళ్ళు వనమాలిగానున్నాను. అందుచే వనమాలి అంటారు.

వైజ : ఏ యూరు?

కృ : నవపురి.

వైజ : మరి ఎందుకు మానివేసితివా ఉద్యోగం.

కృ : మానవుల స్వార్థం సహించలేక.

వైజ : అనగా?

కృ : సౌకుమార్యం - సౌందర్యం - సర్వత్ర విందుజేయు సరోజములను వంచి, తుంచి దండలుగా జెడలపైనను, మెడలపైనను అలంకరించుకొందురే గాని దిఙ్మాత్రంగా చూచి ఆనందింపలేడే మానవుడు. అచ్ఛమైన అందమునుజూచి లోకం ముచ్చటపడవలెగాని సర్వం తానే అనుభవింపవలెననే స్వార్థమేల మానవాళికి?

వైజ: అట్లయిన ఆ పుష్పముల జన్మప్రయోజనమేమి?

కృ: లోకసేవ. అందరకు అనుభవం కలిగించి ఆత్మార్పణ జేయుట. అట్టి నిష్కామసేవ జేయు వివిధపుష్పములవలె విశిష్ట ఆదర్శాలతో - విభిన్నదృక్పథములతో - విశ్రుత మనుతములతో వెలసే యీ విశ్వమానవకోటిని ఏకైక ప్రేమసూత్రంతో సంఘటితపరచుటయే నా ఆశయం. అదే నా జీవితాదర్శం.

వైజ: ఆ ప్రేమ ఎలా లభ్యమగును?

కృ: సాధనజేసిన.

వైజ: ప్రేమ సాధించు వస్తువా?

కృ: నిష్కామయోగంతో - నిశ్చల చిత్తంతో నిర్వికార సంకల్పంతో - ఉపాసించిన.

వైజ: అది నాకు సార్పెదవా?

కృ: ఏది?

వైజ: ప్రేమ.

కృ: నీకా? నేనా? (నవ్వును)

వైజ: ఏమి - నేను పనికి రానా? నేనూ అనాఘ్రాత పుష్పము నే.

కృ: నీవు గావచ్చు. కాని, నేనో! అందును గుడ్డివాడను. ప్రేమ నాకు చేతకావలె; అది నీకు నచ్చవలెగదా, వయ్యారిభామవు.

వైజ: నీ ఊహాపోహాలు, నీ ఉన్నతాదర్శములు నా కెంతయో నచ్చినవి. గంపెడాశలు ఒడిగంటి బియ్యంవలె మూటగట్టుకొని నీ యెదుట నిలబడితిని. మరి -

కృ: ప్రేమ గ్రుడ్డిదన్న యిదే కాబోలు.

వైజ: అగుగాక. గ్రుడ్డిలోకంతో నాకేమిపని. స్త్రీ స్వాధీనపడునది సౌందర్యమునకుగాదు, సౌజన్య సాహిత్యములకు.

కృ: ప్రేమజీవితంలో అపనిందలు - అప్రతిష్ఠలు - ఐనవారి అదరింపులు - పైవారి బెదరింపులు - దినదినగండములు; ప్రాణత్యాగములు.

వైజ : ఐనగానిమ్ము ఆత్మార్పణకైనను సిద్ధమే. నేర్పు ఆ ప్రేమమంత్రం

కృ: ప్రేమ - మంత్రంగాదు జపమునకు. నినాదంగాదు ప్రచారమునకు. అదియొక మహాక్రతువు అందు కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా - సర్వం బలిపెట్టాలి.

వైజ : ఎవరికి?

కృ : పరమాత్మకు

వైజ : ఆతడెక్కడ ఉన్నాడని?

కృ: నాలో - నీలో - ప్రపంచంలో.

వైజ : ఎట్లుండును.

కృ: నీవు తలచేవిధంగా - కొలిచే రూపంతో.

వైజ : నేను నిన్నే కొలిచెదను. నాకు నీవే ప్రియుడవు; దేవుడవు.

కృ: సరే శుభం. (వెళ్ళిపోవును)

వైజ: ఎక్కడికి ప్రయాణం?

కృ : చెప్పలేదా - నేను సర్వాంతర్యామినని. ప్రేమ అంటే ఒకరికేనా అంకితం!

వైజ : ఎంతమందేమిటి?

కృ: లెఖ్ఖపెట్టినదెవరు?

వైజ : ఎవరైనా సిద్ధిపొందిరా నీ చేతిలో?

కృ: అది వారిగీత; రాకపోతే నా వ్రాత,

వైజ: నాగీత మంచిదేమో నీ చేతిలోపడితిని. పాఠం చెప్ప ప్రేమ అంటే, శ్రద్ధగా నేర్చుకొంటాను. నీ పేరు చెప్పుకొంటాను.

కృ: (పలుకడు)

వైజ: పలుకవు; నేనంటే యిష్టంలేదా? నన్ను ప్రేమించుటలేదా – నన్నూ, నా సౌందర్యాన్ని పూలహారం చేసి మెళ్ళోవేసుకో.

కృ: మరి దక్షిణ ఏమిత్తువు?

వైజ: పాలా? పెరుగా? వెన్నా?

కృ: ఆకోరికలన్నీ చిన్నప్పుడే తీరినవి.

వైజ: ఇంక నేనేమివ్వగలను, నా సర్వం నీకు సమర్పణ చేసిన పిమ్మట.

కృ: నీకు కానరానిది; నాకు తెలిసినది – కోరికోననా?

వైజ: ఊ —

కృ: వైజయంతీ!

ఉ. వెన్నెల పాలవెల్లి ప్రభ
వించిన మీగడ నిగ్గుదీసి, సం
భిన్న పయోజ గర్భమున
బెట్టి, తదీయ విరోధ దోషమున్
గ్రిప్పనమాన్ప, సంతత వి
లాస నికాసము విందుజేయు నీ
కన్నుల కాంతిపుంజముల
కానుక లీయగరాదె సుందరీ.

వైజ: (సందేహాత్మమై విస్మయమున) గోపాలా! నీవు నిజముగా అంధుడవా? లేక ఇది నాటకంలో అంతర్నాటకమా?

కృ: ఏమి?

వైజ: నా అందం నీకెలా అగపడుచున్నది?

కృ: సరిగ్గా నామాదిరిగా. నీకూ నాకు భేదమేమున్నది.

వైజ: ఔను. మనతనువులు వేరైనవిగాని, ప్రేమైక సాంప్రదాయము లొక్కటేగదా.

కృ: మనస్విని!

గీ. విష్ణు వక్షస్థలంబున వెలయుచుండు
వకుళమాలిక పేరాను వైజయంతి;
ఆ మహాదృష్టశాలి వీవౌదువేమొ!
మధుర భావాత్మక ప్రేమమందిరమున
ఆరగింతము కలకాల మైక్యమగుచు
వలపు బువ్వంపు బంతి; ఓ వైజయంతి.

(ఇద్దరు ముందుకుపోదురు)



శ్రీరస్తు

# శ్రీకృష్ణగారడి

## నాలుగవ రంగం

స్థలం: వల్లకి యిల్లు

సమయం: సాయంకాలం

(శోభన ముహూర్తం. శయ్యాగారం. గది అంతా అలంకరించి యుంటుంది ఫలహారపుపళ్ళెములు. పూలపందలతోను. పుష్పాడి పొగలతోను ప్రదేశమంతా ఘుమాయిస్తున్నది. వైజయంతి ఖిన్నురాలైఉంది. వల్లకి ఆమెకు పూలజెడ వేస్తున్నది)

వల్లకి: అదేమిటి ప్రొద్దుటినుంచి ముఖం ముడుచుకొని కూర్చున్నావు.

వైజ: కర్మంకాలి.

వల్లకి: అలాఅనకు పైన తథాస్తు దేవతలుంటారు.

వైజ: ఉంటే - వాళ్ళంతా ఒక్కసారివచ్చి నన్ను తీసుకొనివెళ్ళరాదూ, నా బాధ తీరుతుంది; యీ కథ మాసిపోతుంది.

వల్లకి: ఏం తీపుతీసింది - సిశ్లేషంగా వందెడు నగలు - ఇండెడు చీరలు.

వైజ: కన్యక కిదేనా కామితార్థం?

వల్లకి: కాక - ఓ కట్నాలా కానుకలా? అల్లుడికి అలక తీరుపులా? ఆడుబిడ్డకు హారతి పళ్లెములా? ఏముంది? చారెడు పసుపు. గోరెడు కుంకుమతో ఆనాడు ఐనదంటే ఐన దనిపించినాము. లేని సమురంభం అని చేసుకుంటే ఏమిటో కసకసలాడుతున్నావు.

నైజ: నదినా! ఆషదాని అంతస్సు నీకు తెలియదా! మగువ కోరునది మహారాజ శ్రీనిగాదు, మనసు కలసిన ప్రేమికుణ్ణి.

వల్లకి: ఇప్పుడు మా వాడికేం తక్కువ? రూపు రేఖలు లేవా? పనిపాటలు చేతకావా? ప్రేమగాట . ప్రేమ - పెళ్ళాడావుగదా యిక ప్రేమించరాదూ?

నైజ: పెళ్ళయినదిగాని ప్రేమ ఎక్కడిది? ఎప్పుడూ ప్రేమించాలి, పెళ్ళిచేసుకోవాలి.

వల్లకి: ఈ సిద్ధాంతాలు రాద్ధాంతాలు నాకు తెలియవు. సంసారికి కావలసినది సాంప్రదాయంగాని సంస్కరణ కాదు. ఇష్టపడి చేసుకొన్న మొగుడితో కష్టాలు పడలేక ఎన్ని కాపురాలు గంగపాలసలేదు?

నైజ: అంతవరకెందుకు రావాలి? పెళ్ళంటే పేరంటమా? హృదయము ఊసురు పెడుతూ - అబల అలమటిస్తుంటే పలుపుతో పశువును బంధించినట్లు తాళిగట్టిన దాంపత్యం ధర్మబద్ధమైనట్లా? మితిమీరి - గతిమాలి - మతిలేక - బ్రతుకు బరువై - ఫలించిన కడుపు భరించజాలక - తట్ట తగులబెట్టినట్లు తల్లిదండ్రులు దాంపత్యం కూర్చెదరు. ఎందుకువచ్చిన పెళ్ళిళ్ళు?

వల్లకి: వారేం చేయగలరు. వారిని కన్నారుగాని వారి రాతలను కన్నారా?

నైజ: ఇక వారికేం ప్రమేయము? బాల్యంలో పసితనమనీ - ఈడేరిన పిల్ల యిల్లు కదలరాదనీ - శాస్త్ర జ్ఞానంవస్తే కాపురం చెయ్యదనీ - ముద్దరాలను మొద్దురాలుగా రూపొందించి కనిపించినవాడికి కట్టబెట్టి చేతులు కడగికొనుటయా? ఇది పెద్దరికమా! వరుని కోరుకొనుట వనితకు గాదా?

వల్లకి: ఎవరు కోరినా సుఖజీవనమేగదా. ఆడపిల్ల ఎప్పుడూ అత్తవారింటిసొమ్ము పతి పాదాలచెంత దాని స్వర్గం.

నైజ: స్వర్గం - ముక్కు-పచ్చలారని ముదిత - లోకపుతీరు తెలియని లోలాక్షి - అచ్చటా ముచ్చటా కోరే అబల - ఏ చపల నాగన్న సరసాలకో - ఏ సన్యాసి సాధింపులకో - ఊడిగం జేసే బానిసయై - ఆడించే వస్తువై - మగ్గి మసియై రాలిపోవు టయా! దీనికి సంఘం సమ్మతియా! రోజులు మారుతున్నాయి శాసనాలు సవరిస్తున్నారు కాని సంఘం చావదు; సంస్కరింప బడదు. సాంప్రదాయం పేరిట అది తన విస్తృత దంష్ట్రలతో కులాంగనల ప్రాణాలను బలిగొంటూనే ఉంది. ఐనను ఆకలి తీరదు మృత్యుదేవతకు, అందరితోపాటూ నేనొక అనాధ పక్షిని.

నల్లకి: లేనివన్నియు కల్పన జేసుకొని మనసు పాడుచేసికొనకు. నాతమ్ము డనిగాదు. అవతారం నిజంగా విష్ణావతారం - నిన్ను అర చేతుల్లో నడిపిస్తాడు. నీ అందానికి హారతి పట్టుతాడు. ఐనా తినబోవుచూ రుచు లెంకుకు?

నైజ: ఏమోవదినా? ఒక్కొక్క గడియ గడచినకొద్దీ నాకు మృత్యువు ఒకొక్క అడుగు దగ్గర పడితున్నది

నల్లకి: ఆదిలో అందరూ యింతే, కాస్త గాడిలో పడితే అన్నీ అల వాటయి మొగుణ్ణి వలలో వేసుకొని భూచక్రమేలుతారు. పద పాయసంతిను. సుముహూర్తం సమీపిస్తున్నది.

నైజ: నాకేమీవద్దు. ఏక్షణంలో నా తల్లి దాటిపోయి తండ్రి వ్యర్థు డైనాడో - ఏక్షణంలో నాకు తెలియకనే యీ దాంపత్యం నాతలకు గట్టినారో - అదే నాబ్రతుకునకు దుర్ముహూర్తమై నన్ను నరకంలో పడవేసినది. అయ్యో! భగవాన్ (కన్నీరు పెట్టుకొనును)

నల్లకి: ఏడుస్తూ ఏరువాకవస్తే కాడి మోకు దొంగలెత్తుకుపోయారట. అలావుంది. అదిగో - పేరంటాళ్ళు వచ్చేవేళ అయింది.

పద – అన్నట్లు మరిచాను. పూలదండ గుచ్ఛమని పూర్ణిమకు యిచ్చాను. తెస్తావుండు – (వెళ్ళును)

సైజ: తెచ్చి ఉరితాడు చేసి నామెడకు బిగించు. నాకర్మకాలిపోయి గదా యీ దురవస్థ ప్రాప్తించినది. ఆయమునాతీరంలో గోపాలుడు కనబడుటయేల? నామనసు కలియుటేల? అప్పుడే అతనితో పయనమైన ఎంతబాగుండేది?

సీ. వాని మోమును జూచి నేనేల మరులెత్తి
జిగి చంద్రమామపై వెగటు దోప
వానిమైసొగసెంచి నేనేల వలచితి
కలువల పాన్పుపై కసటు దోప
వాని నవ్వుదలంచి నేనేల జిక్కితి
చిక్కని పాలపై చేదుకొనగ
వాని మాటాలించి నేనేల లోనైతి
చిలుక పల్కులపైని చులకనవగ
అతని సాహసమే నేల ఆశపడితి
అవని రతి మన్మధుల రాజ్యమాక్రమింప
ఇందుకేమందు? ఏమందు తిందునిపుడు
బ్రతుకు బరువులు బాసి స్వర్గంబు జేర.

(దుఃఖించును)

వల్లకి: (అవతారంను వెంటబెట్టుకొని ప్రవేశిస్తూ) రా – నీ పాలిట స్వర్గసీమ – నీ జీవితానికి దేవత – నీవు కోరుకొన్న గుణ సుందరి – ఇంతెందుకు ఇదే నీ ప్రణయవాహిని. ఇక బంగారు పాపే వెలయునో, భాగ్యరేఖయే విరియునో – అలా సిగ్గుపడతావే మబ్బాయి. (తీసికొనివచ్చి పానుపుపైన కూర్చుండబెట్టి) జై జయంతీ! పట్టుదలలకు పోక – కట్టుబాట్లు విడనాడక – కలకాలం కాపురంచేసి పుట్టింటికి అత్తింటికి పేరు గడించు.

(ముత్తయిదువులు వస్తారు) ఒసే మణికర్ణికా! ఏమే శశిరేఖా! రండి. పండుతాంబూలం పట్టుకెళ్ళండి. (అందరికి పళ్ళు తాంబూలాలు యిప్పిస్తుంది. పుచ్చుకొని అందరు వెళ్ళుతారు) అదిగో ఫలహారములు – ఇదిగో గంధం – (వైజయంతిని దగ్గరకు తీసుకొని చెవిలో) కోడి కూసేసరికి గుట్టుచప్పుడుగా వాళ్లోకి వచ్చివేయుము. ఊఁ – వస్తా (గదితలుపు వేసి వెళ్ళును)

వైజ: (తటాలున తలుపునద్దకు పరుగెత్తుతూ) వదినా! వదినా!

అవతారం: (వైజయంతి చెయ్యిపట్టి లాగి) ఒసే ఎక్కడికి పారిపోతావు.

వైజ: ఒసే! పనిమనిషిని పలకరించినట్లు. నేను బానిసనా?

అవ: కాక – మహారాణివా? (చెయ్యిపట్టుకొని తీసికొనివస్తాడు)

వైజ: (చెయ్యి విడిపించుకొంటూ) నేను అమ్ముడుబోయిన ఆట వస్తువునుకాను. నోరు వాయిలేని దిష్టిబొమ్మను గాను, చైతన్యములేని శిలాస్థూపాన్ని గాను. నేను జ్ఞానం – విజ్ఞానం ఉన్న మనిషిని.

అవ: మనిషినిగాక పశువును చేసుకొంటానేమిటే? మొదవనుగా నేవు; అంగణాల గొడ్లను ఆరుంబాతిక చేసే అవతారాన్ని.

వైజ: నా కోసం సృష్టింపబడిన అశార్ధూలానివి.

అవ: ఏమ నీ మొగుణ్ణికానా?

వైజ: ఔను లోకానికి.

అవ: నీవు నా పెళ్ళానివి గాదా?

వైజ: సంఘం దృష్టిలో.

అవ: కొంపతీసి మనకు పెళ్ళి కాలేదంటావేమిటి?

వైజ: పెళ్ళి! చందమామబొమ్మలకు సరదాగా పెళ్ళికుట లేదా? జయంతులకు పటాలుపెట్టి పెళ్ళిళు చేయుట లేదా? నాటకంలో వేషాలకు నామమాత్రంగా పెళ్ళి అగుట లేదా? అంతే ఐనవారి ఆగింపులకు - అమ్మలక్కల పేరంటములకు గాక ఆలుమగలు సుఖపడుటకా?

అవ: ఏం సుఖపెట్టనే చెయ్యిపట్టుకొంటే రయ్యిమది రంకెలు వేస్తుంటే ఇదిగోచూడు నిన్ను నెత్తిన పెట్టుకొని ఊరేగుతా కంట్లో పాపలాగ కాపాడతా - ఇంకెందుకు. పెళ్ళామంటే మన యెవారం ఎలుగుబంటి పుట్టను బట్టుకొన్నట్టే సరేనా?

వైజ: హరిహరీ!

అవ: (వికటంగా) హరిహరీనారాయ డాదినారాయుడో కరుణించుమమ్మేలు కమలలోచనుడ. ఇదేంటిగాని, యెనక గొంతెత్తి పాడితే చెట్లమీాద పిట్లలు చెదరిపోయేవి.

ఈరంగం వేస్తూ వీరభద్రుడి శివం తొక్కితే వాడితన్నది యిస్కా - కడుపులో పిండాలు దూసుకుపడేవి. మనయెవారం ఏమంటావు దుక్కి దున్నామంటే ఏటా జవ్వలుపంట పండాలసిందే. తెలుసా - పదసె. సెట్టాపట్టాలు పట్టుకొని సిలకా గోరువంకలలాగు ఆడుకొందాం పాడుకొందాం; ఏదోసేసుకొందాం. సరిగాని నీవొక పాటపాడు.

వైజ: నాజీవితమే అపశ్రుతిలో పడింది. నాజీవన నాటకానికి ప్రథమరంగంలోనే భరతవాక్యం పాడించినది. నేను పాడుకొనేది మృత్యుగీతం. దానికి నా గాత్రం పలుకుటలేదు.

అవ: పాలుతాగు, బాగవుతుంది చూడు. వేడిచల్లారిపోనీకు మళ్ళీ పొంగు రావాలంటే విరిగిపోవచ్చు, తరుగురావచ్చు.

వైజ: ఇంతకంటె ఒక గుక్కెడు విషం పోయరాదూ - హాయిగా మింగి అంతమైపోతాను.

అవ : అంతయిష్టంలేనిదానివి అప్పుడే పెళ్ళిమానెయ్యక పొయ్యావా? చేసుకొని యీశివాలెందుకు?

వైజ : నాహృదయం పరాధీనమైంది. ఇక మిగిలినదంతా యీకనుపించే కట్టెమాత్రమే.

అవ : నేను దాన్నే కోరితే!

వైజ : అది ప్రేమ కానేకాదు.

అవ : ప్రేమట, ప్రేమ! ఎక్కడుందే ప్రేమ. కథల్లోనూ కవిత్వాల్లో తప్ప. నేను ప్రేమిస్తున్నానని సిగ్గువిడచి చెప్పేదెవరే. ఐనా యీ ప్రేమకు ఆది అంతం ఎక్కడ.

వైజ : ప్రేమ అంటే అంత నైచ్య వ్యాఖ్యానమా?

అవ : ప్రతివాడికీ ఆడదాన్ని తాకాలనే తాపత్రయం ఎందుకు? నిజంగా ప్రేమిస్తే తిండి బట్ట యిచ్చి తిరగనిమ్మను, ఆడదాని యిష్టంవచ్చినట్లు, తెలుస్తుంది ఆ సన్యాసుల సామంతం.

వైజ : ఐన, మనటానికీ కనటానికా మగునకు మనువు.

అవ : సోదలోకి దిగుతున్నావు నిన్ను పెళ్ళాడానంటే 'నీవు' అనేది అంతా నాదే. కాదంటే ప్రాణం తీస్తా. అంత అదుపులో పెట్టలేని అనాథకాడే యీ అవతారం! పద. (బలవంతంగా కౌగలించబోతాడు. వైజయంతి గుభాలున కూలిపడుతుంది, అవతారం ఆమెను లేవదీస్తే ఆపస్మారం వచ్చినదానివలె అభినయిస్తుంది. అతనికి అలవిగాదు, ఆయాసపడతాడు. మంచం మీదికి తోసి బలవంతంగా ముద్దిడబోతాడు వికృతంగా నవ్వుతుంది. ఖంగారుపడి తగ్గుతాడు. ఆ వికృతమైన నవ్వుతోనే ఆమె వెళ్ళిపోతుంది.)



కృష్ణ: నేను నటన సూత్రధారినిగదా - సత్యా. (దగ్గరకు వచ్చును)

సత్య: దగ్గితికిరాకండి దానిని తాకిన ఆ పాపపు చేతులతో -

కృష్ణ: సత్యా-అడుగున పడిన అశేషజగత్తును అంటించిన వీ చేతులు- ఇవే మూడు అడుగులు దానము గ్రహించినవికూడ - లోక కళ్యాణార్థం శిక్షింపగలవు; రక్షింపగలవు. అట్టి ఈ రెండుచేతులు మోడ్చి-సత్యా-క్షమాపణ కోరుకొనెదను. నా సాంగత్యంలో ఏ వైపరీత్యము లేదు. ఈ మధుర నాటకాంతమునగాని యిందలి సత్యా సత్యములు-గుణా గుణములు నీకు అర్థం కావు-తొందర పడకు.

సత్య: ఎంతమోసం! పానుపుపై భార్యను వంచించి పర భామకై వత్తురా? మగనాలి కింతకంటె అవమానమేమున్నది?

కృష్ణ: హరిభగవాన్! (కూర్చొనబోవును)

సత్య: హరిహరి. లేవండి. ఎవరైనవచ్చిన మధ్య నా పరువు పోవును. ముందీ అలంకారం ధరించండి

కృష్ణ: (అలంకృతుడై) దేవి!

సత్య: అదిగో మరల నదేమాట. పెళ్ళాన్ని వేధించు ఆ పిశాచిని - కాపురమ్ములు తీయు ఆ కామినీ గ్రహమును - రానిండు. నా కాలిక్రింద నలిపివేతును.

కృ: ఎందు కంతకోపం సత్యా -

సత్య: కోపంగాబా? ఆ వయ్యారి దుస్సంకల్పంతోనే వచ్చిందనండి. మీకుమాత్రం --

ఉ. సిగ్గ! శరంబు! నేరకాక
చేడియలోకపు తీరెరుంగకే
ల్లొగ్గిడిగా చరింప నది
లోకువ జేకురె ! ఆడదన్నచో

లగ్గెల కెక్క పైబడు దు
రాగతముండునె ? నీతిమంతులే
భగ్గము పాపుగా దిగగ
పామరులెంత ? మహా పతివ్రతేన్
భగ్గున మండి పోదె తన
భర్త పరాంగన కూడియాడగా ॥

కృ : ఉత్తమస్త్రీమ తత్వమునకీ వైజయంతీకలాప మొకమహా కావ్యము. ఇందు మోహం – కామం – ఏమీ లేదు.

సత్య : ఉన్నను, లేకున్నను, ఇక్కడ ఒక్క క్షణమైనను నిలువరాదు పదండి పోదము.

కృ.: (వైజయంతి వెళ్ళినవైపు నిరీక్షిస్తున్నట్లు చూచును)

సత్య : ఏమిటి చూచుచున్నారు. దానికోసమేనా ? పదండి అది వచ్చే లోపున. ఎందుకు వచ్చిన ఆగం; అభాసు.

కృ : స్త్రీజాతి కెందు కింత ఈర్ష్యయో.

సత్య : ఎందుకా ? సతీత్వం సర్వం సహింపగలదు. ప్రాణేశ్వరుడే పరమేశ్వరుడని సేవింపగలదు. కాని –

ఆ ॥ నగలనీయవచ్చు నాణెంబు లీవచ్చు
తియ్యనైన ప్రాణ మియ్యవచ్చు
తనదు భర్తనన్యవనిత చేతికిచ్చి
తాళగలదె యెట్టి తరుణియైన ॥

వైజ : (పకపకనవ్వుతూ వస్తూ) గోపాలా ! (కృష్ణునిజూచి నివ్వెర పడి) ఎవరూ ? శ్రీకృష్ణ !! (చిన్నబుచ్చుకొని) అమ్మగారూ గోపాలుడేడి ! ఏడీ !

సత్యా: ఎవరూ ?

వైజ: ఇంతవరకు యిక్కడ ఉండెనే! నల్లనివాడు - పద్మనయనమ్ముల వాడు - సుధారసంబు రాజిల్లెడువాడు - గోపాలుడు - వేణు గోపాలుడు -

కృ: (పలుకబోవును)

సత్యా: (నివారించి) ఏమో నన్ను కావలిపెట్టి వెళ్ళితివా ?

వైజ: కోపపడకండీ అమ్మగారూ - అతడు నా హృదయం; దైవం - సర్వస్వం - ఆ - మరచితిని - ఇదుగో పొంగలి. మీకోసం తెచ్చితిని -

సత్య: మేము గొల్లభామలంగాము, పొంగలిభోజనములకు. మీ గోపాలునకు పెట్టు - తినిపించినప్పుడు.

వైజ: అయ్యో - గోపాలా! అమ్మగారూ - మీ కాళ్ళకు మొక్కెదను - మా గోపాలుని చూపండి. వేణుగోపాలుడు - నవపురీ గోపాల బాలుడు - చూపండి - ఒక్కమారు పలుకరింతును - ఒక్కసారి చూచుకొందును. పలుకరేమి తల్లీ - ఆడుబిడ్డను. అఙ్జలిచాచి అర్థిస్తున్నాను. కటాక్షించండి.

కృ: (జాలిగా) వైజయంతీ!

వైజ: (తల వంచుకొని తొలగును అయిష్టంగా)

సత్యా: చాలులెండి - సరాగం - ఈ రంగ మింతవరకు చాలు. పదండి. (బలవంతంగా కృష్ణుని తీసుకొని పోవును)

వైజ: గోపాలా! గోపాలా!! వేణుగోపాలా!!! ఈ యమునా తరంగ ఘోషలో నా గాత్రం వినబడుటలేదా ? లేక హాస్యమున కెందైనను దాగియుంటివా! (బిగ్గరగా) గోపాలా! (ప్రతిధ్వని వినిపిస్తుంది) గోపాలా!

శా॥ ఏవో తీరని ఆశలల్లుకొని, యె
న్నే ప్రేమసౌధాల నీ
సావాసమ్మున జీవితంపు మధువా
స్వాదింప నాశింపగా
ఈ వేళన్ కథ కంచిబోయె మనమిం
టిన్ జేరినట్లయ్యె; నా
భావాకాశమునుండి రాలిపడితిన్
పాతాళలోకంబునన్ ॥

(వెదకుచుపోవును)



# శ్రీకృష్ణగారడి

## ఆరవ రంగం

స్థలం : అవతారం ఇల్లు

సమయం : ఉదయం

వల్లకి — వైజయంతి

వల్లకి : ఈ ఇంట్లో కాలునిలవకపోతే యిక కాపురం ఏం కాలబెట్టుతావు? వంటా పెట్టా? పసువుల పాడి చెయ్యాలా? పైమనుష్యులకు సేవ చేయ్యాలా? ఏంకష్టం వచ్చింది?

వైజ : నా కష్టం నన్ను కట్టెల్లో పెట్టినగాని పోదు.

వల్లకి : తీపరంగాకపోతే — ఇంటెడుచాకిరీ చేసి — వడ్లు దంపి—గొడ్లను మేపి — పాలుదీసి — పెరుగు అమ్మి — ఒకపనా ఒకలోకమా? పొద్దస్తమానం రాటంలాగు తిరిగి యిల్లు చక్కబెట్టుతున్నానే. మొగుడుపనేగా చూడుకోలేవూ? కాస్తమాటా పలుకూ ఆడితే నీ నోటిముత్యాలు రాలిపోతాయా?

వైజ : కోప్పడకు వదినా? చెప్పండి చేస్తాను. చాకిరీకేగదా నా సంసారం. బానిసత్వమునకేగదా నా బ్రతుకు, చెయ్యక ఏం చేస్తాను?

వల్లకి : ఎవరికోసం చేస్తావు? లోకంలో నీవే కాపురం చేస్తున్నావా? వాడిపనే నీకు అలవిగాకపోతే యిక బిడ్డలు పుట్టితే ఏం సంరక్షణ చేస్తావు?

వైజ: నా ప్రాణానికి వాళ్ళుకూడా యెంహాలకు? యిప్పుడు నేను పడుచున్న నరకంచాలకనా?

వల్లకి: దేశదిమ్మరై వాడు రాకపోబట్టిగాని కాలంలో కార్యంచేస్తే నీకీ కాకి చమ్మల కథలన్నీ అబ్బేవా? ప్రేమట, ప్రేమ! పాత వారంతా మొగుణ్ణి కొలవలా? సీత రాముణ్ణి పెళ్ళాడి ప్రేమించలేదా? అడవిలోగూడా ఆయన్ను అంటిపెట్టుకొని తిరిగిందే, ఆ మహాయిల్లాలు.

వైజ: అందరు రాముడువంటి ఆదర్శ భర్తలైతే ప్రతి మగనాలి వైదేహివలె నుంటుంది.

వల్లకి: అనాడు – "కడవడి కొరగాకున్న బడుగైన–విడచుట మర్యాద గాదు విభుని'' అని వేదాంతం చెప్పితివే మరీ –

వైజ: ఇప్పుడు మాత్రమేమి? సేవింతును పూజింతును. సహజీవనం నెరవేర్తును. అవసరమైన స్వాత్మార్పణచేతును.

వల్లకి: కాని ఇల్లాలుగా నుండవు; అదేనా నీవు చెప్పేది?

వైజ: ఉన్నాగా వదినా –

వల్లకి: ఆడది యిలా ఉండగలదా? ఉన్నా లోకం నమ్ముతుందా? నమ్మినా ఎంత పతనమౌతుంది?

వైజ: కానిమ్ము. నా హృదయం ఎక్కడలగ్నమైందో అదేనాకు మహోన్నత ప్రణయ గోపురశిఖరం.

వల్లకి: ఎక్కడే – అది నీ తలలోనుందా?

వైజ: గోపాలమూర్తిలో –

వల్లకి: ఎవడేవాడు? ఆ గుడ్డి ముండాకొడుకా? వాడొక వేణుగోపాలుడున్నా నీవొక అభినవరాధవు బయలుదేరారు. వాడువచ్చే

వేళయినది. కావురానికి నిప్పు పెట్టుకొనకు తరువాత పశ్చా త్తాపపడి ప్రయోజనం లేదు. వాడినిరానీ – నీ అంతు కను క్కుంటా మీా వేళ – (నిళ్ళకోసం బిందె తీసుకొని వెళ్ళును)

భగవాన్ ! ఆడువారికొరకే ఈ అస్వతంత్రం సృష్టింపబడెనా? స్త్రీజన్మ కిదేనా కర్మ? గోపాలా ! వేణుగోపాలా !! నా దుర దృష్టమింతేనా? నా మొరాలకించువారు లేరా? (గూటిలోని పావురమును జూచి) పావురమా ! నేనునూ నీవలె యిచ్చట బందీనై యుంటిని. సాటివానను కొంచెంసాయ మొనర్చవా?

మ ॥ ఇదిగోరమ్మని మాయజేసె; బహునా
ళ్ళైగెన్ శతాబ్దంబులై
సదయుండేటికి రాడు? నాయెడ కటా
క్షంబెల్ల పోనాడెనో?
మదిదాపీడెనొ వైజయంతిపయి ప్రే
మన్? ఈ వియోగాగ్ని నన్
బ్రిదికింపన్ బ్రతిమాలి నాధుగొనిరా
వా, దేశసంచారివై ॥

నా ప్రియుని పేరు, రూపము – తెలుపనా?

గీ ॥ రాశిజేసిన శృంగార రసమనంగ
చక్షులకు దోచుకరుణాతిశయమనంగ
మహిని వెలిసిన నిర్వాణ మధు వనంగ
నవతరించెను గోపాలుడై జగాన ॥

(పావురమును చేత బుచ్చుకొని) అతనితో ఆడుకొంటిని; పాడు కొంటిని; త్వమేవాహమ్మంటిని. ప్రేమలో ఎంత దూరమో ప్రయాణము చేయుదమనుకొంటిని. వెన్నెల రాత్రిలలో

కన్నె వలపులు కలకాలం పండించుకోనేద మనుకొంటిని. ఏమో అనుకొంటిని,

ఉ॥ ఎంతని చెప్పఁ దాన; హృద
యేశుని ప్రేమకళా కలాపముల్
చింత కెడంబులాయె; మును
జేసిన బాసలు మోసమాయె; న
న్నింతులు నవ్వనాయె; వ్యధ
లే కథలాయె; వియోగమున్న, ద్వీ
పాంతరవాపమేగడ, అ
భానమెరుంగని ప్రేమజీవికిన్ ॥

దేశదేశాలు తిరుగాడి నా నవమోహానంగుని – సుందర దరహాస విలాసలాలసకళా స్వరూపుని – అనంతమోహ జగన్మోహన విగ్రహుని – ప్రణయ అవతారమూర్తిని – (అవతారం ప్రవేశించి నిశితంగా నిలబడును) నా వేణుగోపాలమూర్తిని – వెదకి –

అవ : (చకితుడగును)

వైజ : ఈ వైజయంతిని – అంతఃపన్న పిత అస్రుధారా పరిక్లాంతను – అనుకంపా వృష్టిచే రక్షింపుమని చెప్పుము. పొమ్ము. (సందేశ పత్రం దాని కాలికి కట్టి) ఈ సందేశానికు ఆ మనోహరుని అమృతవాణి అందుకొనిరమ్ము (విసరి వేయును)

అవ : (దానిని పట్టుకొని వికృతంగా నవ్వును)

వైజ : (విభ్రాంతయగును)

అవ : (పావురమును తిరిగి గూటిలో పెట్టి ముందుకువచ్చి సందేశపత్రం విప్పిచదివి చింపి ముక్కలు చేయును) ఇప్పటికి దొంగదొరికింది.

వైజ : నాకేంకర్మ దొంగ బ్రతుకునకు.

అవ : ఔను నీకేం భయం అన్నీ తెగించినదానికి. దాగుతుందా దొంగ తనం; రంకుతనం.

వైజ : అన్యాయంగా మాట్లాడకండి. నేను కులటనుగాను. పదుపు స్మృతిగల పాతకినిగాను.

అవ : కాక మహా పతివ్రతవా? నుంగళసూత్రం వాల్చ్ మారుమగని పై ఆశాపాశములా! ఎందుకే నీకీ సంసారం!

వైజ : లోకాచారమునకు; విశేషించి మీా సేవకు.

అవ : అందుకు దాసీది చాలదూ, అన్నం బట్టయిస్తే.

వైజ : అంతకంటె ఘనమా నా జీవితం.

అవ : అంటే - నీవు పేరుకుమాత్రం పెళ్ళావివి అన్నమాట.

వైజ : అందుకే ననసేల? మీా సేవకు, పరిచర్యకు, మీా సహవాసము నకు; సంప్రదాయమునకు.

అవ : నీవంటే అపరూపమైన అభిమానం నాకు. నీతో ఉండటమంటే అదొక స్వర్గం నాకు. అందుకోసం యింత ఆరాట పడ్డాను గాని ఆడది దొరకక కాదు. 'కో' అంటే కోటిమంది.

వైజ : ఎందుకు దొరకరూ, అనాధలెక్కువయిన యీారోజుల్లో. ఆడ దాన్నియింత అధ్వానంగా సృష్టింపరాదని ఏ బ్రహ్మ అయినా ఆలోచించాడా? స్త్రీజీవితో న్నతికోసం ఏ మహర్షి అయినా తపస్సు చేసినట్లు ఎక్కడన్నా విన్నారా? ఆఖరికి దేవేంద్రుడు కూడా తన అధికారం నిలబెట్టుకొనుటకు ఆడదాన్నే ఆటవస్తువుగా నిలబెట్టాడు, తపోభంగాలు చేయించి.

అప: అక్కడికి పురాణం అపు. పతివ్రతలంతా నీ కళ్ళకు పనికి మాలినవాళ్ళు, సావిత్రి నీ ముందు సన్యాసీ అన్నమాట.

వైజ: అదా అర్థం. సరిగ్గా సంవత్సరానికి పోతాడని తెలిసికూడా; సత్యవంతుణ్ణే పెండ్లాడినది సావిత్రి. ఎందు చేత? ఆమె మనసార ప్రేమించింది. మగనికోసం ప్రాణార్పణకైనా సిద్ధపడింది. యముడికే ఎదురుతిరిగింది. వరం పొంది వచ్చింది. ఆ సిద్ధి ఎవరిదని? చచ్చి పడియున్న సత్యవంతుడిదా? అది పవిత్ర ప్రేమ విజయం. అది ఆడదాని అపూర్వ సేహ ఫలితం. అది సావిత్రి పుణ్య ప్రభావం. అదృష్టం ఉంటేసరి నేనూ అంతటిదాననౌతాను.

అప: సత్యవంతుడిలాగ నన్ను చావమంటావేమిటిప్పుడు. నీ మొగానికి తోడు ప్రేమ తత్వాలు, పతివ్రతా ధర్మాలుకూడనా.. ఆ మహా యిల్లాండ్రి పేరు తలవటానికైనా నీకు తాహతుందా?

వైజ:. ఏ విధిలోవుంటే వారినిమించి వైకుంఠంలో విష్ణుసాయుజ్యం పొందుతానేమో.

అప: పొందవూ - విభావానికి వేదాంతమొకటవట.

వైజ: అదిగో ఆ మాటే అనకండి. నా అంతిప్ను ఆ భగవంతుడికే తెలియాలి. స్వార్థలోకానికి ఏమర్థమౌతుంది?

అప: అదే పెడర్థం. చెప్పు మెవ్వర్తో ఆ గోపాలుడు. ఏమిటి వాడంటే ఏకీ పిచ్చి. ఏమైనా మందుపెట్టాడా మతి విరిచాడా?

వైజ: మందా - ఆ - అదే ప్రేమ మందు. మీకేం అనుమానించనక్కరలేదు. ఆ గోపడంభుడు. కృష్ణుడు మాదిరిగాదు సాక్షాత్ విష్ణువు - మా ప్రేమ శారీరకంకాదు ఆత్మీయం. మా సాధన

స్వార్థానికిగాదు విశ్వమానవ ప్రకృతికి. మా అనుభూతి సౌఖ్యం లోగాదు సృష్టి సౌందర్యంలో.

అవ: అయితే వాడితో లేచిపోక పోయ్యావా. మనిషి ఇక్కడా మనసు అక్కడనా? తిండి యింట్లోనూ తిరుగుడు పైనా? నీవల్ల దండగ నాకు పండగ వాడికేనా?

వైజ: దైవసాక్షిగా నేనేం పాపం చేయలేదు

అవ: నోరుముయ్యి అంతటి వెధవనుగా నేను. నీ నాటకం అంతా చూస్తూ నేవున్నా.

వైజ: ఏం చేస్తున్నానంటారు?

అవ: వంచిస్తున్నావు. నన్ను గాదు లోకాన్ని; పైగా నిన్ను నీవే. అనుభవిస్తావు. కల్లబొల్లి మాటలతో కాపరం తీపి దాహం తీర్చుకోగానే అన్నం తిన్న విస్తరివలె అవతల పారేస్తాడుగాని తీసుకు వచ్చినదాన్ని పోషించే సన్నాసి యెవడే.

వైజ: (నిశితంగా) నేను కులటను గాను కులాంగనను నేను భానిసను గాను ఒక ఆదర్శానికి అవసరమైన బలి కాగలపడతిని.

అవ: అనుభవిస్తావు. ప్రేమవేరు పెళ్ళాం వేరు కాదు. అంతానికి దాంపత్యసుఖమే అన్నింటికీ.

వైజ: శాసించి సాధిస్తారా దాన్ని?

అవ: తన్ని సాధిస్తారు. మంచివాణ్ణిగనక మాటలతో పోనిస్తున్నాను

వైజ: ఐన ఇప్పుడేం చెయ్యమంటారు?

అవ: మెట్టవేదాంతం కట్టిపెట్టమంటాను. నోరు మూసుకొని పడుండమంటాను. కాదూకూడదంటావా కాలికి బుద్ధి చెప్పు. పలకవేం?

వైజ: నా కర్మానికి ఎవరు కర్తలు.

అప: అయితే ఇక నేం? నీ బలి తిరుగుడంతా సహించి – ఎంగిలికూటిని పొంగలివలె తింటూ– నంగిరెద్దులాగ తల ఊపుతుండమంటావు అంతేనా? అయితే వెళ్ళు. ఈ జన్మలో యిక కనపడకు. తిరిగి నీవుకాదుగదా కృష్ణరాయబారం వచ్చినా వినను. మళ్ళీ పెళ్ళి చేసుకుంటా

వైజ: అందుకు నే వద్దన్నానా?

అప: వద్దనేటందుకు కద్దనేటందుకు నీవెవరు? నా యిష్టం. చచ్చా వనుకుంటా. ఉండి సుఖం లేనప్పుడంతే.

వైజ: నేను నిర్దోషిని. జన్మాంతం నాకు మీరే భర్తలు. మన అంతస్సులమధ్య ఈ అగాధంపైన పూలవంతెన కట్టుకొన్నానాడు త్వమే వాహమ్మని ఏకమౌతాము.

అప: ఈ జన్మలో లేదు. పో – నాకంటికి కనపడకుండా ఈ కాళరాత్రిలో కలసిపో – ఈ పాడులోకంలో మాయమైపో – అనాధపక్షిలాగ అంతమైపో.

(బయటకునెట్టి తలుపు వేయును)



# శ్రీకృష్ణ గారడి

## ఏడవ రంగం

స్థలం : వనభూమి

సమయం : రాత్రి

వైజయంతి . (భర్తృవిదూరయైన వైజయంతి భూమిపై అంతులేని ప్రయాణం చేస్తున్నది. ఎక్కడికో తెలియదు. ముందేమగునో అర్థం కాదు. జనపదాలు దాటింది. సరసీతటాలు నిర్గమించింది, అడవిన పడింది. జడివాన కురిసింది. సుడిగాలి వీచింది. నడచింది నడచింది. అడుగు సాగక ఆయాసభరంతో నీరసించింది. క్రింద నేల – నెత్తిన ఆకాశం – తరిగిపోని వృక్షాలు – ఇవే ఆమెకు తోడునీడలు. ఎడ తెగని నడకచే బడలిక ఆమెముఖాన మూర్తీభవించింది. పక్షులు పడకటింటి ముచ్చట్లు చెప్పుకొంటున్నట్లు కలకలారావములు చేస్తున్నవి.)

గీతం

పాడిందె పాడకే
లోకమా
పాడి మా ప్రాణాలు తీయకే ॥

1

లేతవలపుల తలుపు
మూత పడిపోయింది
మోసు లెత్తినగుండె
కోసికొని పోయింది

ఎన్నాళ్ళు ఈ కర్మ
ఎన్నేళ్ళు ఈ జన్మ
నిరయమా – నిస్పృహా – నిర్వేదమా – స్త్రీకి ॥

2

ఎడద విరిసిన పూలు
అడవి పాలై రాలె
మధుర జీవన వీణ
శిథిలమై శ్రుతి పోయె
ఏమిటో ఈ కక్ష
ఎందుకో ఈ శిక్ష
ప్రగతియా – విగతియా – ప్రారబ్ధమా – స్త్రీకి ॥

లోకంలో నవాలోకం ఉదయమందినదని తాత్వికుల ప్రబోధం. కాని శోకం నన్ను వెన్నాడుచున్న దేల? ప్రేమయే జీవకోటికి ప్రాణం అని పారమార్థికుల సిద్ధాంతం. కాని ఆ ప్రేమ భగ్నమైనదేమినాకు? సనాతన – అధునాతన – సంఘర్షణలో గాని చరిత్ర సృష్టి కాదని కాలజ్ఞాన కర్తల వాదన. ఈ కలయికలో ఏమిటీ వేదన నాకు?

ఎంత పయనించినను యీ యాత్ర కంతు లేదు ఇది నా జీవితమునకు మహా ప్రస్థానమా? అట్లయిన ఏ స్వర్గం చేరుటకు? ఇంకను స్వర్గమా ఈ వైజయంతికి స్వర్గమేమి యెక్కడా యీ భూతలంకంటె – యిదే స్వర్గం – నాకు మాత్రం నరకం – కాదూ యీ పాపికి. పాపి – పాపినా నేను. నేను పాపినిగాను. దోషినికాను. ప్రేమించుట పాపంకాదు. అదే పాపమైతే ప్రళయం రావలసిందే. జగద్విలయమే. సర్వం నాస్తి.

(దూరాన)

♦ ♦ ♦ ♦ ♦

మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరాః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రతః

♦ ♦ ♦ ♦ ♦

ఎక్కడదీ అసమయ ఆకాశవాణీ సందేశం. ఓ అంతర్వాణీ. నిది అమృత వాక్కు. నిజంగా నా జీవితమీాస్థితిలో నాస్తియే. సృష్టికే కర్తవ్యమున్నది. నాకేదీ?

ఓ భాసమానోన్నత అశరీరవాణీ !!!

ఒకడు: (ప్రవేశించి) ఆ! ఎవరు?

వైజ: ఈ భయంకర కాళరాత్రిలో – ఈ భీభత్స సమయంలో – ఎవరు నీవు? మాంత్రికుడవా తాంత్రికుడవా?

భిక్షువు: కానుతల్లీ. నేనొక భిక్షువును.

వైజ: ఇచ్చట నీకు పాదాన మొసంగువారెవ్వరు?

భి: దేవుడు.

వైజ: ఏన ఒకచోట కూర్చుండి తపస్సు చేసికొనక యీా జంజాట మేమి?

భి: ఇప్పుడిది యంతయు తపస్సుగాక ఏమిటి? నాముక్తికై తపస్సు చేయటం స్వార్థంగాదూ. లోకంకోసం సేవ జేయవలె. అందులో సిద్ధి పొందవలె, అందరికి విముక్తి కలుగవలె.

వైజ: నిర్జనావాసమైన యీా అధ్వానపు అడవిలో ఎవ్వరుందురని సేవింతువు.

భి: పశుపక్ష్యాదులను; వన్య మృగాలను; క్రిమి కీటకాలను. ఎవరైన దారి తప్పి వచ్చిన మీావంటి బాటసారులను,

వైజ: అవంటే నీకేంభయం లేదన్నమాట.

భి: హరిహర బ్రహ్మాదులు వచ్చినా, సరే సత్పుంగులకు మాకేం భయం? శ్రీకృష్ణా - ఆపదోద్ధారకా అన్ని ఒక్కసారి ప్రార్థిస్తే సరి. అదే అన్నిటికి మూలమంత్రం ఇంతకు ఎవరవో తల్లీ ఏకాకినివై వచ్చుచుంటివి,

వైజ: నేనొక మందభాగ్యను.

భి: ఈ అర్ధరాత్రి ఎచటికి బోవలెనని?

వైజ: దిశాంచలములకు.

భి: ఆపదలచే హతాశవైనట్లున్నావు. రాతల్లీ నా వెంట. నీకు తరణోపాయము చూపించెదను

వైజ: రాను. నేనెవ్వరి ఆశ్రయమున నుండను.

భి: పోనీ - ఉదయంవరకు మా గురువుగారి సన్నిధిన నుండి వెళ్ళుము.

వైజ: ఎవరు వారు?

భి: ఆనందతీర్థుల వారు. సాధుపుంగవులు. దగ్గరలో నేవుంది ఆశ్రమము ఆ ప్రభాసతీర్థంచెంత ఏమో సందేహించుచుంటివి. అచ్చట అసంఖ్యాక శిష్య బృందము అశేష మహిళా మండలి. భజనలతో భగవత్కథా కాలక్షేపములతో వైకుంఠమే వసుధపై వెలసినట్లుండును. రాతల్లీ.

వైజ: (ఆశతో నడుస్తూ) నాయనా! ఈ మధ్య ఎవరైన అంధభిక్షువు మీ ఆశ్రమమునకు వచ్చెనా?

భి: ఎవరో - ఎందరో వచ్చెదరు; పోయెదరు. గురువుగారు సర్వం విశదం చేయగలరు. పదతల్లీ - (పెద్దగా)

శ్రీకృష్ణా - ద్వారకీవాసా - ఆపదోద్ధారకా



# శ్రీకృష్ణగారడి

## ఎనిమిదవ రంగం

స్థలం : ఆనందతీర్థ ఆశ్రమం

సమయం : ఉదయం

(శ్రీకృష్ణవిగ్రహం, పూజాపీఠం, పూజాసంగ్రహం, ధూపదీపనైవేద్యాలు, భక్తులసమావేశం, నృత్యవాద్య విశేషములు, స్త్రీ పురుషులు భక్తితో సంకీర్తనలో పాల్గొంటారు)

ఆనందతీర్థ : (శ్రీకృష్ణవిగ్రహమునకు పూజచేసి, పూలహారం అలంకరించును)

సంకీర్తన : ఆనందభైరవి - ఆది (జంపె) తాళం.

వీక్షే కదా దేవదేవం గోపాలమూర్తిం
సాక్షాన్మదనకోటి సౌందర్య భావం

1 ప్రకట మృగమద తిలక రమణీయఫాలం
సకల గుణసంపత్తి సహిత ముఖఖేలం

2 బృందావనాంతభువి విశ్రుతవిహారం
నందనందన మఖిలవందితాకారం

3 కాలమేఘ శరీరకలిత విద్యుద్వసనం
కేళీకలాకుతుక కించిత్కుంచితాధరం

4 తధిమి ధిమికి ధిమితి తాండవ విలోలం
సిద్ధజనవినుత ప్రసిద్ధతరశీలం ॥ వీక్షే ॥

వైజ: (ఒక వంక నిలబడి వింటూ నిశ్చేష్టురాలగును)

తీర్థ: శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా!
శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్ర వంశదహనా
లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణ గోగణార్తిహరణా!
నిత్యానుకంపానిధీ!
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్
నిర్వాణ సంధాయకా॥

వైజ: (తనను తీసికొనివచ్చిన భిక్షువుతో మెల్లగా) గోపాలమూర్తి అని కీర్తించుచున్నారు, ఎవరిని?

భి: ఇశ్! ఇది నామసంకీర్తన. తెలియుట లేదా?

తీర్థ: శ్యామసుందర మదనమోహన బృందావన విహారి!
గోవింద - గోపాల - గోవర్ధనగిరిధారీ!
హరే! మురారే! మధుకైటభారే!
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥

వైజ: (సంకీర్తనచేయక నిలబడును)

తీర్థ: ఏమితల్లీ! సంకీర్తన చేయకుంటివి?

వైజ: స్వామీ! భగ్నజీవిత భయంకర వికృతాట్టహాసం. కంఠేకాలుని ప్రళయతాండవ ముద్రాంకిత ఘంటారావం - స్మశానవాటికా చితాగ్నిచ్ఛటా భీభత్సం -

తీర్థ: అర్థమైనదితల్లీ నీ బాధ.

వైజ : నా విషాదగాథకు ఫలశ్రుతి లేదు. అంతయు అయోమయం; అనంతం. స్వామీ గోపాలుని మీరు చూచితిరా?

తీర్థ : కనబడుటలేదా? అదుగో చతుర్దశ భువన సౌందర్యమూర్తి. (విగ్రహమును చూపును)

వైజ : ఆ విగ్రహమా!

తీర్థ : అది విగ్రహమా! నిగ్రహించుకొని దర్శింపుము.

వైజ : కాదు. అతడు నా గోపాలుడు కాదు.

తీర్థ : అతడు వట్టి గోపాలుడే గాడు వేణుగోపాలుడు. నవపురీ గోపాలుడు!

వైజ : (కంపితయై కన్నీరు చిందించి గద్గదికయై) ఎవరు స్వామీ! గోపాలుడు.

తీర్థ : భగవాన్. శ్రీకృష్ణపరమాత్మ. ఏ మట్లు ఉద్విగ్నవైతివి. నీ జీవితాకాశమున చెలరేగిన ఝంఝూమారుత మేమి?

వైజ : ఇంకను జీవితమేమి? నేను నిర్జీవిని.

తీర్థ : దుఃఖింపకుము. ఈ దాసుడు నీకు చేతనైన సేవ జేయును. నిర్భీతిగా నుండుము.

వైజ : సౌందర్యోపాసన నా సాధన – ప్రేమించటం ప్రేమకొరకేనని నా ఆదర్శం – అంతయు అడియాసయైనది. స్వామీ! ప్రేమించుట పాపమా?

తీర్థ : పాపమూ కాదు; పుణ్యమూ కాదు. అది మోక్ష సాధన జీవరాశికి. అది మహత్తరమైన విధి యీ విశ్వమానవకోటికి.

వైజ : మరి నాకీ విపర్యయమేల? బృందావనములో అందువలన నా హృదయం అంకితము జేసికొంటిని. అతడు విశ్వప్రేమ అంటే

విశిష్టంగా తెలసిన విద్వాంసుడు. మురళీనాద మృదు మధుర సుధారాశి. ఆ సహావాసము స్వర్గమైనది.

తీర్థ : అదృష్టవంతురాలవు.

వైజ : అది కోపకారణమైనది ఎంతో కాలానికి అప్పుడే వచ్చిన అజ్ఞాత భర్త అవతారమునకు. నా కన్యాత్వం సత్యాగ్రహం చేసినది ఆయన పిపాసకు. అపచారంలేని ఉపచారం చేసితిని. ఉత్కంఠతో ప్రార్థించితిని. ఏమి ప్రయోజనం! నా జీవన వృక్షాన్ని మోడుచేసి నరకి వీధిలో విసరివైచెను. స్వార్థసంఘం నన్ను అర్థం చేసుకొనకపోయినను నా గోపాలునికై అన్వేషించుచుంటిని ఇంతలో మీ దర్శనం. స్వామీ! ఎవ్వరా గోపాలుడు? ఎక్కడనుండునో చెప్పుడు. సర్వజ్ఞులు మీకు తెలియనిదేముండును? ఆతడు -

ఉ ॥ కారు మొయిళ్ళ నల్లసిరి
కాయముదాల్చెనో? కాక - నవ్య శృం
గార రసంబుచే కరడు
గట్టెనో? కాక - మనోజ్ఞమోహగం
భీరతనూ విలాసముల
బీల్చెనో? నా గను మర్ల గొల్పనం
భోరుహ నేత్రు దివ్యనయ
నోత్సవపేశల కథావిశేషముల్

తీర్థ : ధన్యవహో పుణ్యశీలా వైజయంతీ!

ఉ ॥ ఎట్టితపంబు చేసితివో
ఏమివ్రతంబుల నాచరించితో

ఎట్టివరంబు పొందితివో
ఏసుకృతంబు లొనర్చి యీ విధిన్
పుట్టితివమ్మ ! దేవఋషి
పుంగవు లెన్నడు యోగదృష్టులన్
బట్టగలేని కృష్ణభగ
వానుడు నీ సఖుడయ్యె తానుగా ॥

వైజ : (కన్నీరు చిందించి) అయ్యో - అవమానితా వైజయంతీ !

తీర్థ : ఏమితల్లీ.

వైజ : ఏమియులేదు. ఎవని చెలిమి నిరసించితినో - ఎవని నైతిక జీవిత మపమార్గంబని విమర్శించితినో - ఆ శ్రీకృష్ణునిచే వంచింపబడితిని ప్రేమయని అవమానింపబడితిని.

తీర్థ : తల్లీ ! నీవు ధన్యాత్మవు. పరమాత్మ సాన్నిధ్యము లభ్యమయ్యె. సంసారతాపత్రయాభీల దావాగ్ని కీలాంతరమున - కామ క్రోధలోభ మోహామద మాత్సర్య మధ్యమున - ఆధివ్యాధి సమాకీర్ణ దైహిక ప్రవృత్తిలో - సాంఘిక - ఆర్థిక - రాజకీయ - నైతిక వాతావరణమున - చిక్కి - విడల్చుకొన్నను విడనేని చిత్తమెట్లు ఏకాగ్రతలోనుంచి వరించితివి తల్లీ.

మ ॥ జపదాన వ్రతహోమ సంయమతప
స్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నేవిభున్ మనములన్
నిల్పంగలేరట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై
విశ్వేశుపై నీకజ
స్రపటుధాన్య మదెట్లు నిల్చెను భవ
జ్జన్మంబు ధన్యంబహో ॥

వైజ: స్వామీ! ఆయన పరమాత్ముడైన స్త్రీలతో స్వేచ్ఛా విహార మేల? సర్వ సంగరహితుడైన సర్వేశ్వరుడుగదా ఈ కామినీ సాంగత్యమేల? రాగద్వేషాదులులేని పురాణపురుషునకీ అనురాగ బంధము లేల?

తీర్థ: అగ్నిలో బడినవన్నియు ఆహుతియగును. కాని అగ్నికేమి పరిణామము సంభవించినది?

చ॥ లలితవిలోల నిర్మల జ
ల ప్రతిబింబిత పూర్ణచంద్రమం
డలము తదంబు చాలన వి
డంబన హేతువు నందియున్ వియ
త్తలమున కంపమందని వి
ధంబున, సర్వ శరీరధర్మముల్
గలిగిరమించు దేవునకు
గల్గగ నేర్వు కర్మ బంధముల్

ఏ పురాణపురుషుని పాదపంకేరుహధ్యాన సంప్రాప్త యోగ నిర్ఘాఢిచే మునీంద్రులే కర్మ బంధముల బాయుదురో! అట్టి కృష్ణునకు కర్మమేమి! బంధమేమి? అది యంతయు లోక విడంబనార్థం పరమాత్మ ప్రదర్శించిన మానుష భావం.

ఆ॥ గోపజనములందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకు పరాంగనలెవ్వరు
సర్వమయుడు లీల సలిపెగాక ॥

వైజ: అజ్ఞానంలోనున్న పసిదాననుగదా. మురిపించి – మోహించి – మోసము జేయుటయా ఇది ధర్మమేనా? తనదాసులతో తా నాడుకొనుటయా?

తీర్థ: వైజయంతీ! దివ్యానుభూతితో నాటకం వ్రాసిన కవి - వివిధ పాత్రల అభినయ ప్రదర్శనంచూచి ఎట్లు రసానుభూతినందునో అట్లే జగత్తులోని చరాచర జీవకోటిలో తానుండియు నుండక తనసృష్టి సౌందర్యంచూచి ఆనందించును, భగవానుడు.

వైజ: స్వామీ! నా మూఢత్వమంతరించినది ఏ సాధు సంసేవనము లేక - గురు బోధామృతము గ్రోలక - అనుభవం గడింపక - అహం ప్రకోపింప యీ అధమస్థితికి వచ్చితిని. నా కర్మమింతియేనా?

తీర్థ: శాంతింపుము. సంకీర్తన సర్వసౌఖ్యముల నిచ్చును.

వైజ: ఇంకెక్కడి సౌఖ్యము? భర్త చెంతనా అనుమానింపబడితిని. ప్రేమికునిచేత నా అవమానింపబడితిని. ఇక శాశ్వత శాంతియే యీ వైజయంతికి.

తీర్థ: నైరాశ్యమేల? ఎప్పటికైనను సాధ్వికి నాథుడే శరణ్యము.

వైజ: ప్రేమవ్యగ్రమైన కూడనా?

తీర్థ: ప్రేమ! పరమప్రేమయైన భక్తియే. అదే సత్యం. అదే దైవం. ఏ మహోన్నత ప్రేమచే నీవా గోపాలమూర్తిని ఆరాధించుచుంటివో ఆ ప్రేమ తోడనే అవతారమందు భగవంతుని దర్శింపుము. అట్లు సాధన చేయుము. నీకు శుభంబగును.

వైజ: ఐన నేనే దోషినా?

తీర్థ: కావు - కాని అజ్ఞానివి. నీ నాదములు ఫలితమీయవు. నీ ఆదర్శమెంత మహోన్నతమో ఆచరణకూడ అంత పవిత్రమై యుండవలె. ఈ సాధనలోపమే నీయీ అశాంతికి కారణము.

వైజ: ఐన విజ్ఞానభిక్ష ప్రసాదింపుము. ఇటనే యోగినినై బ్రహ్మచర్య వ్రతమవలంబింతును.

తీర్థ : మగనాలికి బ్రహ్మచర్యమేల. సంసారమందు ఈ సంకీర్తనతో సర్వేశ్వరసాక్షాత్కారము సాధ్యమగును. ఆతడు అమాయకు డైనను; అహంకారియైనను తుదకు అసురుడైనను పతిపూజ చేసి పతిపాదములచెంత ప్రణయాంకితవుగమ్మా నీ సాధనలో అనుభవం కలిగి అజ్ఞానం నశింప అప్పుడు వివాహము పునీత మై నిష్కామ యోగసిద్ధి కలుగును. అది నిర్వాణప్రాప్తియే.

శా ॥ అంధుండైన పతిన్ వరించి, పతిభా
వాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి నియమ
ప్రఖ్యాతయై మించదే
గాంధారీసతి పుణ్యశీల, అమరా
గ ప్రీతి చిత్తంబులో
సంధిల్లన్ పతిసేవజేయదె మహా
సాధ్వీగుణారూఢయై ॥

వైజ : (ఆనందతీర్థుల పాదములపై వ్రాలి) మహాత్మా! మీ దయా పాత్రురాలను. ఈ దాసురాలికి కర్తవ్యం బోధింపుడు. మా ఆలుమగలమధ్య కలిగిన ఈ ఆదర్శవైరుధ్యంలో - యీ అను మాన అగాధమును నిర్గమింప తరణోపాయ ముపదేశింపుడు.

తీర్థ : ఆ యుపదేశికుడు పరమాత్మ శ్రీకృష్ణభగవాన్.

వైజ : కృష్ణభగవానుడా? ఆ మహానుభావుని ఎదురాడితిని; ఎన్నో అనరాని మాటలంటిని. నన్ను నిరసించునో దరిజేర్చునో -

తీర్థ : అమ్మా - ఎంతపిచ్చిదానవు!

మ ॥ కలలోనన్ దనుము న్నెరుంగని మహా
కష్టాత్ముడైనట్టి దు

ర్బలు డాపత్యయంబునన్ నిజ పదా
బ్జాతంబు లుల్లంబులో
దలపన్నం తన మెచ్చి యార్తి హరుడై
తానైన నిచ్చున్ సుని
శ్చల భక్తిన్ భజియించు వారికిడడే
సంపత్స్వ శేషోన్నతుల్

వైజ: కృష్ణపరమాత్మ లోక రక్షాకరుడేయగు గాని ఏ ముగము పెట్టుకొని నే నేగుదాన? ఎట్లా పురుషోత్తము దర్శనమగును

తీర్థ, నిశ్చల భక్తియోగంతో శిర్విరామ సంకీర్తన జేయుము ప్రసన్నుడగును. తల్లీ ఈ హారతి నందుకొనుము.

కీర్తన: కేదారగౌళ రాగం - ఆదితాళం,

మంగళాలయ మానవదేవ
పంకజాసన భావిత భావ

1. దేవకీ వసుదేవ తనూజ దివ్యకిరీట దళితభవ బీజ
సర్వయోగి విచింత్య పదాబ్జసంగ తాఖిలసాధు సమాజ

2. అపరిమితానందబోధ స్వరూప అతికరుణాకర కరధృతిచాప
కపటదైత్య హరఖండిపాప కనకాంబరధర కలితకలాప

3. మకరకుండల కేయూర విభూష మనసిజ శతకోటిమంజుల వేష
వికచకమల సన్నిభవిపులాక్షవిమలహృదయ గోపాలకరక్ష



# శ్రీకృష్ణగారడి

## త్రొమ్మిదవ రంగం

స్థలం : ద్వారక - శ్రీకృష్ణమందిరం

సమయం : ఉదయం

వైజయంతి : సంకీర్తన :

సౌరాష్ట్రరాగం - ఆదితాళం.

శరణంభవ కరుణాంమయి కురుదీన దయాళో
కరుణారస వరుణాలయ కరిరాజ కృపాళో
అధునా ఖలు విధినామయి సుధియా సురభరితం
మధుసూదన! మధుసూదన! హర మామక దురితం
వరనూపుర ధరసుందర కరశోభిత వలయ
సురభూసుర భయ వారక ధరణీధర కృపయా
త్వరయా హరభరమీశ్వర సువరత్య మదీయం
మధుసూదన! మధుసూదన! హర మామక దురితం
ఘృణిమండల మణికుండల ఫణిమండల శయన
అణిమాది సుగుణభూషణ మణిమంటపసదన
వినతాసుత ఘనవాహన మునిమానస భవన
మధుసూదన! మధుసూదన! హర మామక దురితం.

దాసి : (భిక్షుకురాలని తలచి ఒక పళ్ళెరంలో బియ్యము మంచి ముత్యాలు తెచ్చి ఉపాదాన మీయబోవును.)

వైజ : శ్రీకృష్ణభగవానుని కరుణా ప్రసాదమునకై పాదచారినై వచ్చిన పేదరాలను నాకు ధనమెందుకు ? ధాన్యమెందుకు ?

సత్య : (వస్తూ) ఎంతసేపే స్వస్తి (వచ్చి వైజయంతిని జూచి) నీవా?

వైజ : (నమస్కరించి) వియోగబాధా పరిదగ్ధజీవిని వైజయంతిని,

సత్య : తెలుసు నీ పురాణమంతయు. జరిపిన గ్రంథము చాలక మరల వచ్చితివా పాతకీ,

వైజ : దేవరవారితో నా దీనావస్థ మొరపెట్టుకొందమని మహారాణీ!

సత్య : కులటా! శ్రేపల్లె అంతయు వెలుగబెట్టి ద్వారకకు దయచేసితివా? ఎవరికాపురము కోడుటకు?

వైజ : తమ కగ్గము కాలేదు తల్లీ. నేను వ్యభిచారిణిని కాను. నేనొక ప్రేమజీవిని.

సత్య : ఛీ! ఛీ! దుశ్చారిణీ! ఎట నేర్చుకొంటివీ పాఠములు. నీ మొగమునకు ప్రేమకూడనా? పెళ్ళి చేసుకొనరాదూ యిట్లు ఊరు పాడుచేయుకంటె.

వైజ : నేనునూ యిల్లాలనే. కాని గ్రహచార వశమున నా జీవితమునకు గ్రహణదోషం పట్టినది.

సత్య ॥ పట్టదూ? చేసికొన్నవాని సేవ జేసినగదా. అయినను మగ మూరక వదలిపెట్టునా, ఏ పాపం నీవల్ల లేనిదే ?

వైజ : నేను నిర్దోషిని అమ్మా.

సత్య : రంకులాడికి బొంకులెక్కువట. పో. పో. నీకర్మమును నీవే నిందించుకొనుచూ నిష్క్రమింపుము.

వైజ : అమ్మో - భగవాన్. (కన్నీరు చిందించును.)

సత్య ! ఇక్కడ ఏడువకు శుభమా అని ప్రొద్దుననే. పో, పోమొదవా లేదా ?

వైజ : పోను. పోజాలను సత్యాగ్రహం చేసియైనను ప్రభుదర్శనం చేసికొందును.

సత్య: హాతం హాత-అని. నేను శ్రీవారికిచందనచర్చ. అహోరాత్రస్వా నామందిరంలోనే నుందును. ఆంను పట్ట మహిషి రుక్మిణికే ప్రవేశం లేదు. ఇక నీకా? హుమ్మ్.

వైజ: మహారాణీ! ఒక్కసారి దేవరవారిని చూడనిండు. ఒక్కక్షణం క్షణకాలమే తల్లీ. మీకాళ్ళకు మ్రొక్కెదను.

సత్య: అసంభవం.

వైజ: అరువది గడియలలో అరనిముసం వియోగం సహింపజాలరా? అందును పతిత జనోద్ధరణకు అమాత్రం త్యాగం చేయజాలరా

సత్య: పిచ్చిదానా! సముద్రపు లోతు ఎంతదుగవగాహమో దాంపత్య ప్రేమకూడ నంతియే.

గీ॥ ప్రియుని సరసాన కెడమైన విరహిణులకు
పగలెల్లను ఉపవాస వ్రతములగును
వలచి వలపింప నెన్నటి చెలిమి లేని
సతికి ప్రతిరాత్రి శివరాత్రి జాగరంబె॥

వైజ: సాటి ఆడుబిడ్డను. అనాథను. అకించనను. ఆర్తత్రాణ పరాయణుని దర్శనభాగ్యము ఒక్కసారి లభింపజేయుము. ఈసోదరిని అనుగ్రహింపుడు. శ్రీవారిని దర్శింపకున్న బ్రతుకనేరను. తల్లీ! తల్లీ!

సత్య: నీవుపోయిన ఈలోకము కేమికొలితి? పోయెదవా లేదా? ఎవరక్కడ? ఈపిశాచిని బయటకుగెంటుము, పొలిమేరదాటింపుడు.

వైజ: (దుఃఖోద్వేగమున) భగవాన్!

శా. అంతర్బాష్ప విలోచనాగ్రములపై
నస్తోకదైన్యమ్ము వ్యా
ప్చింతా తంతువులెల్ల చిక్కువరుపన్
చేఃంపియుస్ దూలె; దు

ద్రాంతానంత దురాప దుఃఖమున నన్
రక్షింప రాకున్న నే
నంతంబయ్యెద దిక్కులేనిగతి కృ
ష్ణా! ఆపదోద్ధారకా॥

: (త్వరితముగ ప్రవేశించి) ఎవరు! వైజయంతి!!

: (శ్రీకృష్ణుని పాదములకు మోకరిల్లును)

: శరణు మహాప్రభో శరణు.

: శుభం భవతు. దుఃఖింపకుము.

: ఈ కులట ఎంత చెప్పినను వినుటలేదు. తనపంతమే తనది.

: అదియే భక్తిభావము.

: ఈమె భావములు నేనెరుగనా బృందావనమున (వైజయంతితో) చూచితివిగదా పొమ్మింక.

ఆమె ఎంత అవస్థలో వచ్చినదో - కాసింత కనికరించిన నీవు న్యాయము పోవునా?

: కనికరమా! సంసారములు పాడుచేయు ఈ బ్రహ్మరాక్షసిపై.

సత్యా! ఈమె సామాన్యగాదు. అకళంక ప్రేమసాధనలో ఆత్మ బలిదాన మొనర్పగల నిష్కామ భక్తురాలు.

: ఈ భూతమా?

అమ్మా! ఆగ్రహించకండి. అనుగ్రహించండి. ఒక్కక్షణ మనకాశ మీయండి; మీ సోదరిని.

: ఎంతమాత్రం వీలులేదు. నాథా! లోన చందన చర్చకు సమయమైనది. పదండి. ఈ కథలకేమి?

కష్టజీవుల విషాదగాథలు - భక్తుల యార్తిబాధలు - నివారణ కన్న మన వేడుకలెక్కువా?

సత్య: నా ప్రేమకన్న ప్రధానములా అవి.

కృ: ఆ – దీనారవముకన్న నీచరణనూపుర ఘలంఘలా రావము మిన్నగాదు. భక్తుని పావన హృదయంకన్న నీపరిణయ భావము ప్రధానముగాదు. ఇంతయేల ? లోక సంత్రాణ కర్తవ్య పాలనకు నా జీవితమే అంకితమైనది. వైజయంతియన్న అదే భావం నాకు.

వైజ: అనుగ్రహింపబడితిని.

సత్య: ఇంతకు ఈరాకాసి వచ్చి అంతయు రసాభాసము చేసినది.

కృ: సత్యా! ఆజ్ఞాబద్ధురాలవై లోనికేగుము.

సత్య: (తల వంచుకొని వెడలిపోవును)

కృ: వైజయంతీ! నన్ను మన్నింపుము.

వైజ: ప్రభూ! ఎంతమాట! నేనిపుడు శ్మశానమందలి సమాధిని. ప్రపంచమున దిష్టిబొమ్మను. చైతన్యంలేని శిలాస్థూపమును. నేను వైజయంతినిగాను వేదనా స్రవంతిని.

కృ: కారణము ?

వైజ: మీారు. స్త్రీలోకమున పతిత అనిపించుకొంటివి. సంఘమునకు అపరాధిని నైతిని. మగనికి వంచకిని–కులటను.

కృ: ఎట్లు ?

వైజ: స్వామీ !

మ॥ అపరాధం బిసుమంతలేక పరిచ
ర్యాభక్తి సంయుక్తనై
ఉపచారంబులు సల్ప నాథుడటు క్రో
ధోద్రిక్త చేతస్కుడై

"కపటీ! యెంగిలికూటి కాశపడు దు
ష్కర్మంబు నాకేల? యీ
మ్మెపుడే మారుమగండు కృష్ణుడగు" నం
చీడ్వంగ నేకాకినై
విపదబ్ధిన్ పయనించుచుంటి; జగతిన్
ప్రేమించుటే పాపమై॥

కృ : (జాలిగా) పాపం.

వైజ : పతితపావనా! దీనశరణ్యా! క్షమించి నన్నుద్ధరింపుడు. తరణో పాయ మనుగ్రహింపుడు, అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణంబను.

కృ ॥ కథానాయికా !

క. ధ్యానాకర్ణన దర్శన
గానంబుల నాతలంపు గలిగిన జాలున్
బూనెదవు కృతార్థత్వము
మానవతీ! చనుము మగని మందిరమునకున్.

వైజ : ఏమొగము పెట్టుకొని పోదును? ఎట్లువారు స్వీకరింతురు? మీ దయలేనిది? విశ్వసంసారముల తీర్చి దిద్దగల సర్వేశ్వరులకు నా యీ పేదసంసారమొక లెక్కయా?

కృ : శుభం భవతు. సిద్ధముగా నుండుము రేపే ప్రయాణం గోకులమునకు.

వైజ : శ్రీకృష్ణా ! ఆపదోద్ధారకా !



# శ్రీ కృష్ణ గారడి

## పదియవ రంగము

స్థలం : వ్రేపల్లెవీధి.

సమయం : సాయంకాలం

(గారడి ప్రదర్శనం - మారువేషంలో కృష్ణుడు. తలపాగ - మురళి - మృదంగం - కట్టుసంచి - మూట - ఏకతార-గారడి ఆటకు వలయు పరికరములు - భిల్లకన్యవలె నాట్యాలంకారముతో వైజయంతి-ప్రేక్షకులు)

కృ : బాలా ! నీలీలా ఈ వేళా చూపాలా
ముద్దులమర్మం సుద్దుల ధర్మం
ఒలికించాలి ప్రేమ కురిపించాలి
నాగులనాట్యం కేళీనృత్యం
డప్పుల లాస్యం - దొమ్మరిహాస్యం
ఈడుజోడుగ - యేరువాకగ
ఒలిపించాలి బాలా మురిపించాలి.
రాణీ రాణీ వలపులరాణీ
మోహంవేణీ దాహంబోణీ
కోయిలవాణీ తీయనిబాణీ
తియ్యాలి ఓణీ చెయ్యాలి మేజువాణి

(వైజయంతి పైన కప్పిన మేలిముసుగు తీసివైచును)

వైజయంతి: (నాట్యం)
కృ: (మృదంగం వాయించును)
వైజ: కీర్తన - మోహనరాగం (రేకుప్తి) ఆటతాళం

గోపాల గోపాల మా ముద్ధర - దేవ - పరమకళ్యాణ గుణాకర
నీరద నీల కళేబర కృష్ణ - నిరుపమకౌస్తుభకంధర
నందనందన భక్త చందన - సురబృందపూజిత బహువందన
మందస్మిత సుందరానన - కోటి మదన సుందర జగన్మోహన
ఇందిరా మందిర భక్త సుందర హృదయారవింద
భృంగభక్తి మకరంద వందిత గోపికా బృంద

కృ: (మురళీ నాదం - వాద్యం)
వైజ: అద్ధిత్వ మేలాసి తద్ధిత్వ మేలాసి
తత్వ్యవ మేలాసి ధూసం
ఉత్తుంగ ముక్తామణి ప్రిస్ఫురద్దివ్య
మత్తేభవర్యోగి చిత్తే స్ఫురంతం
నృత్యం తమత్యం తమానందమీడే -
హితంత్వా మహంత్వా మహంత్వా మహం

కృ: (నాదం వాద్యం)
వైజ: జయశీల నటనమిహ సకల జగదాదిం - సకలముని గీతం
సకల నిగమాంత జనితాంతమతి విదితం
రంగత్తు రంగమాతంగ వరహంసగతి
మంజీర మంజురట నటమఖిల రంజనం

కృ: (గానం - వాద్యం)
వైజ: సంగీత సాహిత్య విద్యా వినోద వరగోవింద గోపాలా
గోపీ మనోహరే - మతిరస్తు రతిరస్తు - మంగళం భవతుమమ.
(అవతారం వల్లకి వచ్చి నాట్యంచూస్తురు)

కృ: (గానం వాద్యం)

వైజ: స్వామినం విచిత్ర వనమాలినం పతత్రి రాజగామినం
పరిపాలిత గోధనం భుజంగపతి శాయినం సదానంద దాయకం-
సమస్తవేద సాధనం - సనాతనం - బాల గోపాలకం భజామి॥

(నాట్యం కాగానే సభకు నమస్కరించి వైజయంతి లోనికిబోవును)

కృ: అమ్మా - దాహం యిప్పిస్తారా!

వల్లకి: అదిగో ఆ ప్రక్కన నున్నవి త్రాగిరా.

కృ: (లోనికి పోవును)

అవ: అక్కా! బలే బాగుంది నాట్యం. యిలాంటిది యింటిదైతే
వెలుగుతాం ఒక వెలుగు,

వల్లకి: ఇమెనాట్యంకన్న వాడి మాటలు పాటలు చాలా రసవం
తంగా ఉన్నవి ఆనాటి మా కృష్ణుని మధురగీతాలవలె మై
మరపిస్తున్నవి

కృ: (వచ్చి సంచి సర్దుకొను చుండును)

వల్లకి: ఏమయ్యా - మీదేవ్వూరు? ఎక్కడినుంచి వస్తున్నారు?

కృ: ఒక ఊరా పల్లా? లోకమంతా తిరుగుతాం. అంగ వంగ కళింగ
కాశ్మీర గాంధార నేపాల భోపాల రాజ్యాలు తిరిగాం. నైమి
శారణ్య దండకారణ్య - కౌరవారణ్య క్రౌంచారణ్యాలు
దాటాం. గంగా యమునా సరస్వతీ సింధు నర్మదా గౌతమీ
కృష్ణ కావేరీ నదుల్లో స్నానం చేశాం. హిమశైలం గంధమా
దన మహేంద్ర సింహాచలం భద్రాచలం అన్ని గిరి ప్రదక్షి
ణాలు చేశాం. అయోధ్య మధురా మాయా కాశీ కాంచీ
అవంతీ ద్వారావతీ సేవించాం. మునిపల్లె కొత్తపల్లె కోటిపల్లె
ఓసపల్లె అన్నీ తిరిగి తిరిగి వ్రేపల్లెలో విడిది చేశాం ఇప్పుడు.

అవ: ఆ పిల్ల నీకు......

కృ: కోడలు బాబూ - (పెద్దగా) రాణీ! (వేణునాదం)

వైజ: (గొల్లభామువలె అలంకృతయై)

జావళి: భైరవి రాగం - మిశ్రచాపు తాళం.

1. రేపు పత్తువుకాని తూరుపు తెలవారె
పోరా యీ వేళకు ॥
నాపతి చూచిన రాపిడి సేయును
కాపురంబు నేను కడగండ్ల పాలౌను
కోపమూనక నాపయిన్ పరి
తాపభారము మానరా
ఏపుమీర సుఖం బొసంగెద
నాపురీ గోపాల బాల ॥రేపు॥

2. కలకలరవముల ఖగము లెగయజొచ్చె
నలువురు ఇటునటు నడయాడు వేళాయె
చెలువుడా యిక వెడలకున్నను
ఇక్కటుల లోనగుదు మకట
పిలువనంపెద నిక్కువముగా
నాపురీ గోపాల బాల ॥రేపు॥

అవ: (లేచి పారవశ్యమున చిందులు తొక్కుచూ)
రాణీ! రేరాణీ! కలవాణీ! పువుబోణీ! (వైజయంతిని లాలసతో చూచును)

వైజ: (జుగుప్సగా తృటిమాత్రం నిలబడును)

కృ: (మురళీగానం - వాద్యం)

వైజ: ఇది ఏమినాటకమోయీ కృష్ణా - -

కృ: (సంజ్ఞ చేసి గానం)
మోమోట పడబోవకు

వైజ: (అవతారంవంక జూచి)
3. ఏ పాపమెరుగను గోపాల యిదివరకు
పాపిష్టి పనిట్లు బలవంత పెట్టకు
కాపు సేయర కొన్ని దినములు
రేపు మాపో కలసి కొందము
ఏపుమీర సుఖంబొసంగెద
నాపురీ గోపాల బాల ॥రేపు॥

(నాట్య విన్యాసంతో లోనకు బోవును)

అవ: వావా! రాజా! నేరాజా! బలతేజ! కాంభోజ !!

వల్లకి: ఇటువచ్చి కూర్చో అబ్బాయీ.

అవ: అక్కా - ఆ అమ్మాయిని చేసుకుంటానమ్మా దాని తస్స దియ్యా. దాని గజ్జెల సందడి నాలో మసలుతున్నది.

వల్లకి: తప్పు తమ్ముడూ?

అవ: నే బతకాలంటే ఆ నాట్యరాణీ ఈ రాజా-రాణి కావాలి.

కృ: ఏమిటమ్మగారూ అబ్బాయి అనేది?

వల్లకి: ఆ అమ్మాయి పెళ్ళిగురించి.

కృ! రాణికా - అయ్య బాబో! పెళ్ళి! దానిని చూపెట్టుకొని బ్రతుకుతున్నాగదా. అదిపోతే నేనేంకావాలి.

అవ: అడిగినంత యిస్తాం. దానితో చాలదూ నీ దరిద్రం తీరిపోవుటకు.

కృ: కన్యాశుల్కమా! (నవ్వి) మనిషినీ మనసును కొంటారా? మీరిచ్చినా ఆ డబ్బు నాకు నిలుస్తుందా?

వల్లకి: అయితే నీవుకూడా మాతో ఉండు, పిల్లను చూచుకొనుచూ.

కృ: నేనా - ఇక్కడ - ఉండగలనా? సర్వాంతర్యామిని.

ఎందుకా అవస్థ-కావాలంటె నీకూ యిస్తాం. తృణమో ఫణమో అమ్మడుబోడుగాని దేవునికూడ కొంటారు బాబూ, మీారు.

: ఆ పిల్లకు పెళ్ళిచెయ్యక పాడుచేస్తావా నీ పొట్టకోసం.

అసలు అది పెళ్ళి కిష్ట పడితేగదా? అబ్బో! దానికెన్ని కోరికలు?

అన్నీ పాలిస్తాం. ఏమిటవి?

ఏమిటో ప్రేమించాలట. ప్రేమించటం ప్రేమకోసమేనట. పవళింపు సేవ భార్యా ధర్మాలలో ఒకటిగాని అదే ప్రధానం కారాదట

అంటే తన ఇష్టారాజ్యంగా ఉంటుందంటావు ఉండమను.

: ఉండమను. వెనుక వైజయంతి ఇలాగేవాదిస్తే అర్థంచేసుకొనక అవతలకి పంపినాము.

వైజయంతియా?

అవును. ఈ అవతారంగారి ప్రధమ భార్య-కాదు-అధమ భార్య-

(లోపనుండి) గోపాలా! గోపాలా!!

రా రాణీ! రంగం సిద్ధమైంది. (అవతారంతో) తీరా క్రియ కాలానికి ఆమె యిక్కడికివస్తే.

(వస్తుంది)

ఇంకేం వస్తుందా వైజయంతి. పోయింది వస్తుందా?

అథవా వచ్చిందనుకో అప్పుడు రాణీని తీసుకొని వైజయంతిని నాటిస్తావా?

ఓ -

రాణీకిపెళ్ళయితే నాటకాలేంకావాలి.

నిక్షేపంగా ఆడుకొమ్మను. నీకేగాదు ఎవరివైననరే.

అంటే ఎక్కడ ఎప్పుడు ఎలాతిరిగినా సరే-

తిరగనీ మనస్సు గట్టికావాలిగాని మనిషిని బంధిస్తే ఏంకార్యం?

కృ : బాగానే ఉంది వరస - బాలా ఈ అవతారమూర్తి భార్యపై సుఖంగా జీవించు. మాట కఠినమేగాని ఇతనిమనసు నవనీతం

వైజ : మీ ఆజ్ఞ ఐనసరి.

కృ : ఐన బాలా కోరుకో ఏంకావలెనో?

వల్లకి : ఏంకోరుకుంటుంది. నగలు నాణ్యాలు. కాగా ఆస్థి-ఎంచుకొనే వారు పంచుకొనేవారు లేరు-అంతా ఆమెదేగదా.

వైజ : ఇదేమిటిగోపాలా? వీటితో నన్ను కొంటామంటున్నారు.

కృ : బాలా! ఆగు. మా మధుబాలకు కావలసింది హృదయం - ప్రేమ - విశ్వాసం అంతే.

వైజ : ప్రేమ అంటే కృష్ణ ప్రేమ.

అవ : వట్టి కృష్ణప్రేమకాదు శ్రీగోపాలకృష్ణ ప్రేమ. ఆయన మా దేవుడేగదా.

కృ : ఏదీ మీరిద్దరు ఒకేశ్రుతిలో ఒకటే మతితో నాట్యం చేయండి. (ఇద్దరు భావగీతం పాడుతూ నాట్యం చేయుదురు)

కృ : (మాటముల్లె సర్దుకొని) పిల్ల మీకు పిల్లనగ్రోవి నాకు. ఇక సెలవా? మాదేశం మేముపోతాము.

వల్లకి : ఎక్కడికి వెళ్ళెదవు? ఇక్కడే ఉండిపో.

కృ : పరదేశిని. ఒక్కచోటనే ఉండగలనా?

ఆనందతీర్థ : (ప్రవేశించి) లోకాలోకాను గ్రహాడీతూ పరతంత్రుడవు. ఏదేశమేగెదవు పరమాత్మా మాకు సందేశ మీయకుండగ!

అవ : ఎవరు పరమాత్మ!

వల్లకి : కృష్ణ భగవానుడా!

తీర్థ : ఔను! (అందరు ఆశ్చర్యపడుదురు)

వైజ : (ఆనందతీర్థులకు మోకరించును)

తీర్థ : సుఖీభవ వైజయంతీ! నీవు ధన్యలలో ధన్యవు.

చ॥ సనకపయోజ గర్భముఖ
సత్తమ దుర్లభ పూర్ణ భక్తి గాం
చిన వనజాత లోచనలు
జేసిన పుణ్యము దెట్టిదో జగ
జ్జనన వినాశ రక్షణ వి
చక్షణుడాద్యుడు బ్రహ్మ రూపి పా
వనచరితుండు శ్రీరమణి
వల్లభుడే వశుడౌటయల్పమే॥

కృ: (మందహాసముతో) మరి వైజయంతిని నా కిచ్చెదవా?

అవ: దేవా! లీలామానుష విగ్రహా! (మోకరించి) మేమేమి యీ చరాచర జీవరాసులెల్లను నీ అధీనములేగదా. క్షమింపుడు. అజ్ఞానాంధకారమున నే సల్పిన అపచారమును మన్నింపుడు.

కృ: వైజయంతీ! విశుద్ధచరితా!! నీ ప్రేమ మహాత్వతత్వ సాధనలో అనేక కష్టములు పాలైతివి. కష్టముల కోర్చిననేగాని కార్యఫలము కలుగ నేరదు. అనుభవంవలన గ్రహించిన ఆత్మ జ్ఞానము అమోఘము. గోకులవాసులారా! కుసుమశోభిత మైన బృందావనంలోని వివిధ పుష్పములవలె విభిన్న మతము లతో విపరీతభావములతో వెలయు యీ విశ్వమానవకోటినిఒకే ప్రేమసూత్రంతో సంఘటితపరచుటయే ఈ కృష్ణావతార తత్వం.

గీ॥ ధర్మరక్షణసేయు కర్తవ్యమునను
అవని శ్రీకృష్ణుడనగ నే నవతరింప
నిరతదర్శన భాగ్యంబు వరము పొంది
పరము గోలోకవాసులీ వ్రజపురాన
రూపమందిరి గోపికా గోపులగుచు.
విష్ణువక్ష స్థలంబున వెలయుచుండు
వకుళమాలికవీవైతి వైజయంతి

విశ్వమందున ప్రేమ అనశ్వరంబు
పరమ ప్రేమయె నిశ్చల భక్తియోగ
మదియె యీ లోకశాంతికి అవసరంబు
విమలభావాత్మక ప్రేమ విజయమందె
ఐహికంబున సర్వమీవనుభవించి
ఐక్యమగు మమ్మ నా పై జయంతిమాల ॥

తీర్థ : ధన్యోస్మి. ధన్యోస్మి ! ప్రేక్షకులారా!

సీ ॥ వేదాంత వీధుల విహరించు ఘనయోగి
విహరించె ప్రేపల్లె వీధులందు
క్షీరాబ్ధిశయనుడై చెలువొందు సుఖభోగి
శయనించె యామునాసైకతముల
యాగహవిర్భాగ మాహరించెడు భోక్త
అడవిలో పొంగలి యారగించె
ఏ వేళ జీవాళి సేవలందెడుసామి
సేవించె గోపికాస్త్రీజనాళి
జగతిజీవన నాటక చక్రవర్తి
పగటివేషంబువేసె ప్రేపల్లెవాడ
ఇదియె శ్రీకృష్ణగారడి ఖేలనమ్ము
దర్శనంబున మీజన్మ ధన్యమయ్యె ॥

అందరు : (మంగళహారతి)

జయ మంగళం నిత్య శుభమంగళం

---

ఈ నాటకమందలి కొన్ని పద్యములు పాటలు పోతన జయదేవ నారాయణతీర్థాది పూర్వ కవుల గ్రంథములనుండి గ్రహింపబడినవి. శ్రీవారందరకు నా నమోవాకములు.